శ్రీరస్తు.

శ్రీమద్ధన్వంతరయేనమః.

# అనుపానమంజరీ.

అను

## వైద్యశాస్త్రము.

ఇది

కాంచీనగరస్థిత సంస్కృతప్రాకృతాద్యనేక భాషానిపుణులగు
నివృత్తి - వీరాస్వామిశాస్త్రులవారిచే

లేఖకప్రమాదజనితదోషంబులువారింపబడి

పువ్వాడ - సూర్యనారాయణరావుగారిచే

లోకహితార్థంబుగ రచియింపంబడిన

ఆంధ్రతాత్పర్యముతోడ

మైనరు

పువ్వాడ * వెంకటరావుచే

హిందూరత్నాకరముద్రాక్షరశాల

యందు ఆఱవతూరి

ముద్రింపించి ప్రకటింపంబడియె.

MADRAS

౧౯౦౭ సం॥ డిసెంబరు నెల

శుభమస్తు.

# ప్ర క ట న.

ఇందువలన దెలియజేయడమేమనగా:—ఇదివరలో వాజీకరణకల్పద్రుమము అను వైద్యగ్రంథము (మొదటికూర్పు)ను ౮౩ పుటలలో అచ్చువేసివిక్రయింపబడినది. ఇప్పుడు సదరుప్రతులు యావత్తున్ను ఖర్చుఅయిపోయినందున మరల దానిని చక్కగాపరిశీలించి, మొదటికూర్పునకన్న రెండున్నరభాగ మధికముగానుండునట్లు అనేక నూతనవిషయములను జేర్చి రెండవకూర్పు ముద్రింపబడియున్నది. దీనిక్రయం రూ. ౧-౮-౦. వలయువారలు చెన్నపట్టణం, పెద్దినాయనిపేట, పెద్దినాయనివీధి, నెం. ౬ గల గృహములో హిందూరత్నాకరం ప్రెస్ ప్రొప్రయిటరైన పిడుగు వెంకటరావు పంతులవారి చేరటికి గొలుసు అక్షరములు లేక చక్కగా విలాసములు వ్రాసి తెప్పించుకొనవలయును.

ఇట్లు

మైనరు, పువ్వాడ - వేంకటరావు.

ప్రకృతము వర్తమానతరంగిణీముద్రాక్షరశాలాధీనమందు

విక్రయమునకు సిద్ధముగనుండు ఆంధ్ర తాత్పర్య సహిత

## వైద్య గ్రంథములు.



| | | | |
|---|---|---|---|
| అనుపానతరఙ్గిణి | ౦ | ౧౨ | ౦ |
| అనుపానమంజరి | ౦ | ౮ | ౦ |
| అశ్వవైద్యశాస్త్రము | ౨ | ౮ | ౦ |
| అష్టాంగహృదయమను వాహటసూత్రస్థానము | ౬ | ౦ | ౦ |
| డిటో. చికిత్సకల్పసిద్ధి, ఉత్తరతంత్రములు | ౧౦ | ౦ | ౦ |
| బసవరాజీయము | ౩ | ౦ | ౦ |
| శార్ఙ్గధరసంహిత | ౩ | ౦ | ౦ |
| సుశ్రుతశారీరము | ౨ | ౮ | ౦ |
| సర్వౌషధిగుణకల్పకము | ౨ | ౮ | ౦ |
| చికిత్సాసారము | ౨ | ౮ | ౦ |
| ధన్వంతరినిఘంటువు | ౨ | ౮ | ౦ |
| సద్వైద్యజీవనము | ౦ | ౮ | ౦ |
| నాడీజ్ఞానము | ౦ | ౨ | ౦ |

మఱియు పెక్కు సంస్కృతాంధ్రగ్రంథములు కలవు.

గ్రంథవిస్తరభీతిచే వివరింపబడవయ్యె. ఈ ముద్రాక్షరశాల పుస్తకముల జాబితాను చూచిన గ్రంథముల నామంబులు వాటికి నియమించిన వెలలు తెలియనగు.



శ్రీరస్తు.

# అనుపానమంజరీ.

## విషయసూచిక.

# విషయసూచిక.



విషయసూచిక ముగిసెను.

తా ॥ (౨౦౦౦) పలములొక భారమనియు, (౧౦౦) పలములొక తులమనియును, జెప్పంబడు - కావున నీగ్రంథంబున జెప్పంబడిన ప్రమాణంబులవన్నిటిని నిదే ప్రకారముగ దెలియంగందగు.

శ్లో ॥ మాషటంకాక్షబిల్వానికుడవః ప్రస్థమాఢకమ్। రాశిర్గోణీ ఖారికేతియథోత్తరచతుర్గుణాః ॥

తా ॥ (౪) మాషములొక టంకమనియు (౪) టంకములొక అక్షమనియు (౪) అక్షములొక బిల్వమనియు, (౪) బిల్వములొక కుడవమనియు (౪) కుడవములొక ప్రస్థమనియు (౪) ప్రస్థములొక ఆఢకమనియు, (౪) ఆఢకములొక రాశియనియు, (౪) రాసులొక గోణియనియు, (౪) గోణులొక ఖారియనియు, దెలియంగవలయు ఇక పచ్చివిగనుండెడి ద్రవ్యముల పరిమాణంబులవచించెద.

శ్లో ॥ గుంజాదిమానమారభ్యయావత్స్యాత్కుడవస్థితిః । ద్రవార్ద్రశుష్కద్రవ్యాణాం తావన్మానంసమంమతమ్। ప్రస్థాదిమానమారభ్యద్విగుణంతుద్రవార్ద్రయోః । మానంతథాతులాయాస్తు ద్విగుణంనక్వచిత్స్మృతమ్ ॥

తా ॥ పైచెప్పిన పరిమాణంబులలో గుంజాప్రమాణము మొదలుకొని కుడవప్రమాణమువఱకు రసార్ద్ర శుష్కద్రవ్యంబులనుసమాంశంబులును, ప్రస్థాపరిమాణంబులకు రసార్ద్రద్రవ్యంబులను శుష్కద్రవ్యంబులకన్న ద్విగుణంబుగను, స్వీకరింపవలయు అయినను తులమను ప్రమాణము నీగ్రంథంబున ద్విగుణంబుగ జెప్పంబడదయ్యె.

పాలుమొదలగువాటినికొలిచెడి పాత్రలక్షణము.

శ్లో ॥ మృద్వేణులోహజేర్భాండంయచ్చతురంగుళమ్। విస్తీర్ణంచతథోచ్చంచతన్మానంకుడవంవదేత్ ॥

తా ॥ మన్ను, వెదురు, లోహము, ఇవి మొదలగువాటిచే నిర్మింపబడి (౪) అంగుళముల వెడల్పు (౪) అంగుళముల పొడవుగల పాత్ర కుడవమని జెప్పంబడు.

శ్లో ॥ స్థితిర్నాస్త్యేవమాత్రాయాః కాలమగ్నింవయోబలమ్ । ప్రకృతిందోషదేశౌచదృష్ట్వామాత్రాంప్రయోజయేత్ ॥

తా ॥ ఈగ్రంథంబున మాత్రలకు ప్రమాణము జెప్పంబడకయుండెడి యెల్లస్థలంబులయందును కాలము, అగ్ని, వయస్సు, బలము, స్వభావము, దోషము, దేశము యీమొదలగువాటిని, రోగబలాబలంబును జక్కగ దెలిసికొని మాత్రలను తాలోచితముగ గావించి బ్రయోగింపందగు.

శ్లో ॥ యతోమందాగ్నయోహ్రస్వాహీనసత్వానరాఃకలౌ। అతస్తుమాత్రాతస్యోగ్యాప్రోచ్యతేసుజ్ఞసమ్మతా ॥

తా ॥ ఇక్కలియుగమునందలి జనులు మందాగ్నిగలవారుగను, పొట్టివారుగను మిగుల బలహీనులుగను, నుండుటచే వారికిమాత్రలు గావించుటకుదగిన ప్రమాణంబును కళింగ పరిభాషాతూనికచే నిచటవచించెద.

శ్లో ॥ యవోద్వాదశభిర్గౌరసర్షపైఃప్రోచ్యతేబుధైః । యవద్వయేనగుంజాస్యాత్త్రిగుంజోవల్లఉచ్యతే । మాషోగుంజాభిరష్టాభిస్సప్తభిర్వాభవేత్క్వచిత్। స్యాచ్చతుర్మాషకైశ్శాణస్సనిష్కష్టంకఏవచ॥గద్యాణోమాషకైష్షడ్భిఃకర్షస్స్యాద్దశమాషకః। చతుఃకర్షైః పలంప్రోక్తందశశాణమితంబుధైః ॥ చతుఃపలైశ్చకుడవంప్రస్థాద్యాఃపూర్వవన్మతాః ॥

తా ॥ తెల్లఆవాలయెత్తొక యవ ప్రమాణమనియు, (౨) యవ లొక గురిగింజయనియు, (౩) గురిగింజలయెత్తొకవల్లమనియు,(౮) లేక (౭) గురిగింజలయెత్తొకమాషమనియు, (౪) మాషములయెత్తొక శాణమనియు, నిష్కమనియు,టంకమనియు (౬) మాషములయెత్తొక గద్యాణమనియు (౧౦) మాషములయెత్తొక కర్షమనియు, (౪) కర్షములయెత్తొక * పలమనియు (౪) పలములయెత్తొకకుడవమనియు, బళింగు మఱియు ప్రస్థాదిప్రమాణంబుల పూర్వోక్తప్రకారంబుగనే ఎఱుంగవలయు.

శ్లో ॥ కాళింగంమాగధంచైవద్వివిధంమానముచ్యతే। కాలింగాన్మాగధంశ్రేష్ఠం మానంమానవిదోవిదుః ॥

తా ॥ కాలింగము, మాగధములన రెండువిధమానంబులుగలవు - అందుకాళింగంబునకన్న మాగధపరిభాష మిగుల శ్రేష్ఠంబుగనున్నదని వైద్యవరులు వచించెదరు.

---

* పలమన పదిశాణములయెత్తు.

ఇతి మానపరిభాషాప్రకరణంనామ సప్తమస్సముద్దేశః.

ఆ ను పా న మం జ రీ.

ముగిసెను.



శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః.



# అనుపానమంజరీ.

శ్లో॥ యస్యజ్ఞానమయీమూర్తిస్సచ్చిదానందకారిణీ । తత్పాద పంకజంవందే గ్రంథసంపూర్ణహేతవే ॥

శ్లో॥ ధాతో స్తథోపధాతోశ్చవిషంస్థావరజంగమమ్ । తద్వికారస్యశాంత్యర్థంవక్ష్యేఽనుపానమంజరీమ్ ॥ పక్వాపక్వస్యధాతోశ్చతథా సర్వవిషస్యచ ॥ సర్వేషాందోషనాశార్థంకథితంశాస్త్రదర్శిభిః॥

తాత్పర్యము॥ స్వర్ణాది సప్తధాతువులు, సప్తోపధాతువులు, స్థావరరూపమగు వృక్ష లతాది విషములు, జంగమరూపమగు సర్పాది విషములు, వీనిచే మానవులకు జనించెడి వికారములను శమింప జేయుటకై అనుపానమంజరి అను గ్రంథమును రచియించెద. మఱియు యథావిధిగ జేయంబడిన సువర్ణాది సప్తధాతు భస్మంబులు, ఉపధాతువులు, వీనిచే గలుగు గుణవిశేషంబులను, యథావిధిగ జేయంబడని సువర్ణాది సప్తధాతు భస్మంబులు, ఉపధాతువులు, వీనిచే గలుగు దోషంబులకును, స్థావరజంగమ విషవికారంబులకును, శాంతులను ఆయుర్వేదాను గుణ్యముగ వచించెద.

## సువర్ణభస్మవికారశాంతి.

శ్లో ॥ హరితకీంసితాయుక్తాంయఃఖాదతిదినత్రయమ్ । తస్యసౌవర్ణశాంతిస్స్యాద్యథాభానూదయేతమః ॥

తా ॥ దోషయుక్తమగు సువర్ణభస్మ సేవచేవికారము జెందిన మనిషి కరక్కాయలు - ఖండశర్కర - వీటిని సమముగ చూర్ణముజేసి మూడుదినములు సేవించిన "సూర్యుడుదయించుటచే చీకటి బఱుగిడు మాడ్కి" సువర్ణభస్మ వికారము నశించు.

## రౌప్యభస్మవికారశాంతి.

శ్లో ॥ మధుచేచ్ఛర్కరాయుక్తంయఃఖాదతిదినత్రయమ్ । పక్వాపక్వస్యరౌప్యస్యశాంతిర్భవతినిశ్చితమ్॥



తా॥ దోషముగల రౌప్యభస్మ సేవనచే నరుడు వికారంబును జెందికృశించు చుండెనేని చీనాశర్కరను చూర్ణముజేసి అందు తేనెకలిపి మూడుదినములు సేవింప వలయు - దానిచే రౌప్యభస్మవికారము నిశ్చయముగ తొలంగును.

## తామ్రభస్మవికారశాంతి.

శ్లో॥ వనవ్రీహీంసితాయుక్తంజలేపిష్ట్వాదినత్రయమ్ । యఃపిబేత్ప్రాతరుత్థాయతామ్రజస్తస్యనశ్యతి ॥

తా॥ అడవి ధాన్యముల బియ్యము - కలకండ - వీనిని సమముగా నుదకము తోనూరి మూడుదినంబులు ప్రాతః కాలంబులయందు సేవించిన దోషయుక్తమగు తామ్రభస్మసేవనచే జనించిన వికారము నివృత్తియగు.

## నాగభస్మవికారశాంతి.

శ్లో॥ హేమాంహరీతకీయుక్తాంసితాంభక్ష్యేదినత్రయమ్ । సద్యోనాగవికారస్యశాంతిర్భవతినిశ్చితమ్ ॥

తా॥ వస - కరక్కాయలు - కలకండ - వీనిని సమముగా చూర్ణముజేసి మూడుదినములు సేవించిన దోషయుక్తమగు సీసభస్మ సేవనచే జనించిన వికారము తొడనే నిశ్చయముగ నివృత్తియగు.

## వంగభస్మవికారశాంతి.

శ్లో॥ మేషశృంగీంసితాయుక్తాంయఃఖాదతిదినత్రయమ్ । తస్యవంగనివృత్తిస్స్యాత్తమశ్చంద్రోదయేయథా ॥

తా॥ వద్దివేరుపట్ట - కలకండ - వీనిని సమముగ చూర్ణముజేసి మూడుదినంబులు సేవించిన "చంద్రోదయమును గాంచిన మాత్రంబుననే అంధకారము బయిగిడు భంగి" దోషయుక్తమగు వంగభస్మ సేవనచే జనించిన వికారము నశించు.

## అయోవికారశాంతి.

శ్లో॥ సేవితంమధుఖండాభ్యాంతుటీచూర్ణందినత్రయమ్ । అయోవికారశాంతిస్స్యాత్తిమిరంసాధుసంగమే ॥

తా॥ కలకండ - ఏలకులు - వీనిని సమముగ చూర్ణముచేసి యందు తేనెకలిపి

మూడుదినములు సేవించిన "సాధుజన సంగమముచే అజ్ఞానము తొలంగు చందంబున" దోషయుక్తమగు అయోభస్మ సేవనచే జనించిన వికారము నశించు.

### త్రిధాతుభస్మవికారశాంతి.

శ్లో॥ యఃక్రమాత్ప్రాతరుత్థాయ సేవయేత్త్రిఫలాకణమ్ । తస్య త్రిధాతుజా శాంతిర్యథా పాపం శివార్చనే ॥

తా॥ త్రివంగ భస్మమును సేవించి అందుగల దోషంబుచే నరుడు కృశింపుచుండెనేని ప్రాతఃకాలంబున * త్రిఫలచూర్ణంబును సేవింపవలయును. ఇట్లొనర్చిన దోషయుక్తమగు త్రివంగభస్మ సేవనవలన జనించిన వికారము "శివార్చనచే పాతకములు తొలంగు చందంబున" నివృత్తియగు.

### లోహభస్మవికారశాంతి.

శ్లో॥ సైంధవంత్రివృతాయుక్తం సేవయేత్తప్తవారిణా । అయోవికారశాంతిస్స్యాత్పాపం కేశవదర్శనాత్ ॥

తా॥ సైంధవలవణము - తెల్లతెగడ. వీటిని సమముగ చూర్ణము జేసి యుష్ణోదకము కలిపి సేవించిన "విష్ణుదర్శనముచే పాతకంబులు నశించుభంగి" దోషయుక్తమగు లోహభస్మసేవనచే జనించిన వికారము నశించు.

### మండూరవికారశాంతి.

శ్లో॥ క్షౌద్రైర్హరీతకీంయుక్తాంయఃఖాదతిదినత్రయమ్ । తస్య మండూరశాంతిస్స్యాత్స్నానాద్దేహమలంయథా ॥

తా॥ కరక్కాయల చూర్ణమునకు సమముగ తేనెకలిపి మూడుదినంబులు సేవించిన "స్నానం బొనర్చుటచే దేహము నిర్మలంబగు మాడ్కి" దోషయుక్తంబగు లోహకిట్టి సేవనచే జనించిన వికారము నివృత్తియగు.

### లోహవికారశాంతి.

శ్లో॥ దూర్వారసంసమాదాయమధునాసహసంపిబేత్! అయోవికారశాంతిస్స్యాత్కష్టవద్దేవిదర్శనే ॥

* త్రిఫలములన కరక్కాయలు, తానికాయలు, నెల్లివరుగు.

తా॥ గటికెరసము - తేనె - వీటిని సమముగ జేర్చి సేవించిన "జగదంబను దర్శించుటచేకష్టములు నివృత్తించెడు భంగి" దోషయుక్తముగు లోహ భస్మసేవ నచే జనించిన వికారము నివృత్తియగు.

శ్లో॥ శ్వేతమార్వారసంధీమాకః తోపలయుతంపిబేత్ । తేన కాన్తోక్షణకాలోహవిషాశ్శాంతిమవాప్నుయుః ॥

తా॥ తెల్లగటికెరసమునకు సమముగ కలకండ చూర్ణము కలిపి సేవించిన దోషయుక్తమగు యినుపభస్మ సేవనచే జనించిన వికారము హరించు.

హరితాళవికారశాంతి.

శ్లో॥ దాడిమస్యఫలంపక్వంజలంతస్యాః పిబేన్నరః । పింగవికార శాంతిస్స్యాత్పాతకంగురువందనే ॥

తా॥ చక్కగ ఫలించిన దాడిమవిత్తుల రసమును పానంబొనర్చిన దోషయుక్తమగు హరితాళకసేవనచే జనించిన వికారము "గురువందనముచే పాతకంబులు భస్మంబులగు చందంబున" నశించు.

ఘోషవికారశాంతి.

శ్లో॥ చించాఫలానిపక్వానిజలేపిష్ట్వాపిబేన్నరః । ఘోషవికార శాంతిస్స్యాద్దారిద్ర్యంనిధిదర్శనే ॥

తా॥ చక్కగ ఫలించిన చింతపండును ఉదకంబునవైచి చక్కగ పిసికి పానం బొనర్చిన "నిధినిదర్శించుటచే దారిద్ర్యము తొలంగుచాడ్పున" దోషయుక్తమగు కంచుభస్మ సేవనచే జనించిన వికారము నివృత్తియగు.

ఇత్యనుపానమంజర్యాం ధాతువికారశాంతిప్రకరణ

స్నామప్రథమస్సముద్దేశః.

---

పాదరసవికారశాంతి.

శ్లో॥ వికారోయదిజాయేతపారదాన్మలసంయుతాత్ । గంధకం సేవయేద్ధీమాన్పాచితంవిధిపూర్వకమ్ ॥

తా॥ పాదరసమునకు సప్తకంచుకాది దోషంబులుగలవు - అట్టిదోషంబులు గలపాదరస సేవనచే వికారము జనించెనేని శాస్త్రోక్తముగ శుద్ధిజేసినగంధకమును

సేవింపవలయు - ఇటు లొనర్చిన దోషయుక్తమగు పాదరస సేవనచే జనించిన వికారము నివృత్తియగు.

శ్లో ॥ గంధకంమాషయోర్ద్వంచనాగవల్లీదళైస్సహ । యఃఖాదే త్పారదగ్రస్తస్తద్దోషస్తస్యశామ్యతి ॥

తా ॥ రెండుమాషనులప్రమాణము శుద్ధిచేసిన గంధకమును తమలపాకులలో నునిచి ప్రతిదినము సేవింపుచుండిన దోషయుక్తమగుపాదరస సేవనచేజనించిన వికారము నశించు.

శ్లో ॥ ద్రాక్షాకూశ్మాండఖండానితులసీశతపుష్పికా।లవంగం నాగకేసంచగంధకేనసమాంశకమ్।కర్షమాత్రం।ప్రయోయుక్తంసర్వమేతత్పృథక్పృథక్ । సూర్యయోగాంతరాసాధ్యాత్సూతదోషవికారనుత్ ॥

తా ॥ ద్రాక్షపండు - ఒరుడిదగుమ్మడుబద్దలు - తులసి - సోపు - లవంగములు - నాగకేసరములు - వీటిని సమముగాచూర్ణము జేసి దానికిసమముగశుద్ధిజేసినగంధకమును గ్రహించిపాలలో రెండుతులములచొప్పన ప్రతిదానినివైచి ప్రాతఃకాలంబున సేవింపుచుండిన దోషయుక్తమగు పాదరస సేవనచే జనించిన వికారమునివృత్తియగు.

శ్లో ॥ నాగవల్లీరసం।పస్థంభృంగరాజరసంశుభమ్ । తులసీరసప్రస్థంచఛాగదుగ్ధంసమాంశకమ్ ॥ మర్దితంసర్వగాత్రేషుయామయుగ్మం దినత్రయమ్ । స్నానంశీతళనీరేణసూతదోషప్రశాంతయే ॥

తా ॥ తమలపాకురసము - గుంటగలగరాకురసము - తులసియాకురసము - మేకపాలు - వీనిని దినుసుకొక్కక్క ప్రస్థము చొప్పన నేకముజేసిసర్వాంగములకు రెండు ఝాములవరకు మర్దన జేయించికొని శీతోదకములో స్నానము జేయవలయు- ఇటుల మూడుదినంబులుజేసిన దోషయుక్తమగు పాదరస సేవనచే జనించిన వికారము నివృత్తియగు.

హరితాళకవికారశాంతి.

శ్లో ॥ జీరకంశర్కరాయుక్తం సేవయేద్దినసప్తకమ్ । తాళవికారశాంతిస్స్యాద్దారిద్ర్యముద్యమేయథా ॥

తా ॥ జీలకఱ్ఱ - శర్కర - వీనిని సమముగ నేకముజేసి ఏడుదినంబులు సేవించిన "ఉద్యోగమువలన దారిద్ర్యము తొలగుచాడ్పున" దోషయుక్తమగు హరితాళక సేవనచే కృశించునటులంజేసెడి వికారము తొలంగు.

శ్లో ॥ కూశ్మాండస్వరసం పేయందురాలభాంతథైవచ । రాజహంసీరసంతోవత్తాలవిక్రృతిశాంతికృత్ ॥

తా ॥ బూడిదగుమ్మడు - దురదగొండివేళ్లు - రాజహంస- వీనిరసమునుసమముగ నేకముజేసి సేవించిన దోషయుక్తమగు హరితాళక సేవనచే జనించిన వికారము నివృత్తియగు.

శ్లో ॥ సువర్ణపుష్పభూనింబక్వాథంసేవేద్దినత్రయమ్ । తాలవికారశాంతిస్స్యాత్తోయమశాంతిస్యాథాస్త్రియా ॥

తా ॥ నల్లఉమ్మెత్తపూలు లేక, బ్రాకుడువేళ్లు - నేలవేము - వీనినిసమముగ దంచికషాయము బెట్టి పానముజేసిన రూపవతియగు, స్త్రీసంభోగముచేకామముశాంతి జెందునట్టి దోషయుక్తమగుహరితాళక. సేవనచేజనించినవికారమునివృత్తియగు.

శ్లో ॥ యథారసవిషంహన్యాద్గోదుగ్ధేచగంధకమ్ । ససితాసర్పాక్షీరసస్తథా తాళవిషంపునః ॥

తా ॥ ఆవుపాలతో శుద్ధిజేసినగంధకమునుసేవించుటచే పాదరసదోషంబును, శర్కర - సర్పాక్షీరసము - వీటిని సమముగ కలిపి సేవించిన హరితాళకజనితదోషంబును, నివృత్తియగు.

మణిసిలవికారశాంతి.

శ్లో ॥ క్షీరకంమాక్షికైర్యుక్తంసేవయేద్యోదినత్రయమ్ । తస్యవికారంకునటీసకరోతికదాచన ॥

తా ॥ ఆవుపాలు - తేనె - వీనిని నేకముగజేసిమూడుదినంబులు సేవించిన దోషయుక్తమగు మణిశిలసేవనచేవికారంబెపుడును జనింపకయుండు.

గంధకవికారశాంతి.

శ్లో ॥ గవాంపయోఘృతైర్యుక్తంపలీవికృతిశాంతికృత్ । తథైవదేవకుసుమంవచాయుక్తంచశాంతికృత్ ॥

తా ॥ ఆవుపాలు - నెయ్యి - వీటినినేకముజేసి సేవించిన గంధక సేవనచే జనించిన వికారముహరించు- మఱియు లవంగములు - వస. వీటిని చూర్ణముచేసిసేవించిన దోషయుక్తమగు గంధకముచే జనించిన వికారము నివృత్తియగు.

అభ్రికవికారశాంతి.

శ్లో ॥ ధాత్రీఫలంజలేపిష్ట్వాసేవయేద్యోదినత్రయమ్ । తస్యవికారశాంతిస్స్యాద్ధ్యాభ్రికస్యనసంశయః ॥

తా॥ ఉసిరికెకాయలవరుగులో జేసి, ఉసిరికాయలలోనేని ఉదకముసై ఓదం
చియుండు రసముతీసి మూడుదినములు సేవించిన దోషయుక్తమగు అభ్రక సేవనచే
జనించిన వికారము నిస్సంశయముగ నివృత్తియగు.

మాక్షికవికారశాంతి.

శ్లో॥ కులుత్థస్యకషాయేణమాక్షికదోషప్రశాంతికృత్ । తథైవ
దాడిమత్వచాదేహస్యసుఖకాంత్కిణః ॥

తా॥ ఉలవకట్టుసైనను, లేక దాడిమకాయలరసంబుసైనను, త్రాగినమాక్షిక
సేవనచేజనించిన వికారము నశించుటయేగాక తేనెచే గలిగినవికారంబునగానశించు.

ఇంగిలీకము, శిలాజత్తు, వీటివికారశాంతి.

శ్లో॥ మరిచంఘృతసంయుక్తంసేవయేద్దినసప్తకమ్ । తస్యశిలా
జితశ్శాంతిస్తద్వద్రక్తస్యశాంతికృత్ ॥

తా॥ మిరియాలు - నెయ్యి - వీటినిసమముగ నేకముజేసి ఏడుదినంబులు సే
వించిన ఇంగిలీకము, శిలాజిత్తు, వీటివికారము నివృత్తియగు.

భల్లాతకవికారశాంతి.

శ్లో॥ సితయాసహయామూచ్ఛ మేఘనాదరసస్యచ । తస్మాద్భ
ల్లంవిషంహంతియథాలింగప్రసేవనాత్ ॥

తా॥ చిట్టికూర రసములో కలకండ కలిపిత్రాగిన " లింగార్చనచే పాతకం
బులుతొలంగుమాట్కి " జీడిగింజలచేజనించిన వికారమునాకరఘూములోనివృత్తియగు.

ఖదిరవికారశాంతి.

శ్లో॥ ఖదిరోద్భవంగోపయసాసితాయుక్తంతథైవచ । యస్సే
వేద్వ్యామమేకంభల్లవికృతశాంతికృత్ ॥

తా॥ ఆవుపాలలో కలకండకలిపిత్రాగిన చంద్ర, జీడిగింజలువీనిసేవన చేజనించిన
కారము నాకరఘూములో నివృత్తియగుటయే గాక జీడిగింజలచే జనించిన వికారమున
గా నివృత్తియగు.

కర్పూరవికారశాంతి.

శ్లో॥ ధాన్యాకంసితయాయుక్తంవారిమర్దితపానతః । కర్పూర
కృవిప్రుత్తిస్సాన్యెన్మహషీశకృతంస్తథా ॥

తా॥ ధనియాలనుఉదకముతో నూరియందుఖండశర్కరకలిపి సేవించినను లేక బత్తె పేడరసము త్రాగినను దోషయుక్తమగు కర్పూరసేవనచే జనించినవికారము నివృత్తియగు.

తుత్థవికారశాంతి.

శ్లో॥ జంబీరరసమాహాయపి బేద్యస్త్రిదినంనరః। తస్యాశుత్థకశాంతిస్స్యాత్తద్వల్లాజేనవారిణా ॥

తా॥ నిమ్మపండ్లరసమును మూడుదినంబులు పానము జేసినను, లేక వరిపేలాలను ఉదకంబునపైచిజక్కగ పిసికి త్రాగినను, దోషయుక్తమగు మైలుతుత్థము, పాలతుత్థము కథరి వీనిసేవనచే జనించిన వికారము తొలంగు.

మృగాంకవికారశాంతి.

శ్లో॥ గవాంఘృతంసితాయుక్తంమృగాంకస్యచశాంతకృత్। తథైవచామ్లకరసస్సద్యోవికృతశాంతకృత్ ॥

తా॥ శర్కరలో ఆవునెయ్యికలిపిసేవించినను, లేక ఉసిరికాయలరసమును త్రాగినను, కస్తూరిసేవనచే జనించిన వికారము శీఘ్రముగ నివృత్తియగు.

నవాసాగరవికారశాంతి.

శ్లో॥ గర్దభస్యవిషంభక్ష్యేత్తథైవనవసాగరమ్। మృత్తికాగైరికాసీమకాంచత్రుట్యంచశాంతకృత్ ॥

తా॥ గాడిదె పెంటికలరసమును త్రాగిన అశుద్ధమగు నవాసాగరసేవనచే జనించిన వికారము నివృత్తిజెందుటయేగాక మృత్తిక, కావిరాయి, అన్నభేది, మొదలగువాని సేవనచే జనించిన వికారములుసగా నివృత్తియగు.

మౌక్తికాదివికారశాంతి.

శ్లో॥ ఘృతంమధుసితాయుక్తంగోదుగ్ధేనసమంపిబేత్। తస్యామౌక్తికప్రవాళస్యహీరకస్యవిషంహరేత్ ॥

తా॥ నెయ్యి - తేనె - కలకండ - ఆవుపాలు - వీటిని - సమముగా నేకముజేసిపానముజేసిన దోషయుక్తమగు ముత్తియములు, పగడములు, వజ్రములు, మొదలగువాని సేవనచే జనించిన వికారము హరించు.

ఇత్యనుపానమంజర్యాముపధాతువికారశాంతిప్రకరణం నామద్వితీయస్సముద్దేశః.

నాగఫేనవిషవికారశాంతి.

శ్లో ॥ బృహత్యస్త్రాకరసంయుగ్ధంపలమాత్రంనిషేవణాత్। నాగఫేనవిషంయాతిసజీవతిచిరంప్రమాన్ ॥

తా ॥ వ్రాకుడురసమును ఆవుపాలలో కలిపి యందొక పలము నేని, నాలుగు తులములనేని, సేవించిన నల్లమందు భక్షణచే జనించిన వికారము నివృత్తియై చిరకాలమువరకు జీవించియుండు.

శ్లో ॥ ఉగ్రాసింధుస్తథాకృష్ణావ్యధోమదనకఃఫలమ్।తప్తనీరేణతద్దేయమహిఫేనవిషంహరేత్ ॥

తా॥ వస-సైంధవలవణము-పిప్పళ్లు-మ్రంగకాయలు-వీటిని సమభాగములుగ ఉష్ణోదకముతో నూరిపానముజేసిన నల్లమందు భక్షణచే జనించినవికారమునివృత్తియగు.

శ్లో ॥ టంకణం నీలతుత్థంచఘృతయుక్తంచదాపయేత్। తేనోనాంతీర్భవేత్సద్యోనాగఫేనవిషంత్యజేత్ ॥

తా ॥ వెలిగారము-మైలుతుత్తము - వీటిని సమముగ చూర్ణముచేసియందు నెయ్యికలిపి సేవించిన వనునంబైనల్లమందు దోషముశీఘ్రముగ నశించు.

ఉమ్మెత్తవిత్తులవికారశాంతి.

శ్లో ॥ వృంతాకఫలబీజస్యరసోద్విపలమాత్రయా । భక్షణాద్భక్తధుత్తూరవిషంనశ్యతినిశ్చితమ్ ॥

తా॥ వాకుడువిత్తులనేని,ఉమ్మెత్తవిత్తులనేని, ఉదకముచేదంచిరసముతీసియందు నాలుగుపలములు సేవించిన ఉమ్మెత్తవిత్తుల భక్షణచే జనించిన వికారము నిస్సంశయముగ హరించు.

శ్లో ॥ కార్పాసపుష్పంసితయాజలేనోక్త్వాల్పపానతః। ధత్తూరస్యవిషంయాతితథాలవణసేవనాత్ ॥

తా॥ పగిడి ప్రత్తిపూలు- కలకండ- వీటినియుదకముతో నూరి పానముసేసిననులేక, లవణమును ఉదకములో కలిపి త్రాగినను, ఉమ్మెత్తవిత్తులభక్షణచే జనించినవికారము నివృత్తియగు.

శ్లో ॥ గోదుగ్ధంప్రస్థమేకంతుశర్కరాయాఃపలద్వయమ్ । తస్యపానాద్విషంయాతిధత్తూరస్యచనిశ్చితమ్ ॥

2

తా ॥ నాలుగు సేర్ల ఆవుపాలలో నాలుగుతులములచీనాశర్కర కలిపి త్రాగిన ఉమ్మెత్తవిత్తుల భక్షణచే జనించిన వికారము నిశ్చయముగ నివృత్తియగు.

వత్సనాభి వికారశాంతి.

శ్లో ॥ పటూశనస్యవృక్షస్యరసఃపలప్రమాణతః। శర్కరా[illegible]క్త పానేనవత్సనాగవిషంహరేత్ ॥

తా ॥ ఒకపలము పటూశనవృక్ష రసములో శర్కరకలిపి త్రాగినవస నాభి భక్షణచే జనించిన వికారము నివృత్తియగు.

భల్లాతకవికారశాంతి.

శ్లో ॥ సర్షపోమేఘనాదశ్చనవనీతసమన్వితః। భల్లాతకభవేశోథేహ్వాంతిలేపేనదేహినః ॥

తా ॥ ఆవాలు - చిర్రికూర - వెన్న - వీటిని సమభాగములుగ ఖల్వంబునపై చిక్కగ మర్దించి శరీరమునకు లేపనము జేసికొనిన జీడిగింజలచే జనించినవాపు నివృత్తియగు.

శ్లో ॥ దారుసర్షపముస్తానినవనీతేనలేపయేత్ । భల్లాతకవికారోయంసద్యోగచ్ఛతిసత్వరమ్ ॥

తా ॥ దేవదారు - ఆవాలు - తుంగముస్తెలు - వీటిని సమముగ చూర్ణముజేసిఅందు వెన్నకలిపి శరీరమునకు లేపనముజేసికొనిన జీడిగింజలచే జనించినవాపు తోడనే నివృత్తియగు.

శ్లో ॥ నవనీతతిలౌదుగ్ధంపునఃఖండయుతంతథా। ఏతద్ద్వయంప్రలేపేనహంతిభల్లాతకవ్యథామ్ ॥

తా ॥ వెన్న - నువ్వులు - వీనినైనను, లేక, ఆవుపాలు - ఖండశర్కర - వీనినైనను, ఏకముజేసి జక్కగనూరి శరీరమునకు లేపనము జేసికొనిన జీడిగింజలచేజనించినబాధ నివృత్తియగు.

తుమ్మెదలకాటుచేజనించువికారమునకు శాంతి

శ్లో ॥ గోదధిశుంఠీసంయుక్తంపానంభృంగీవికారనుత్ । శిఖస్స దంశజంతద్వజ్జలేపిష్ట్వాంపిబేన్నరః ॥

తా॥ శొంఠిని ఆవుపెరుగుతోనూరి యందు ఆవు పెరుగు కలిపి త్రాగినను, లేక, సోపు - పసపు- వీనిని నుదకముచేనూరి త్రాగినను తుమ్మెదల కాటుచే జనించిన వికారము నశించు.

గురిగింజలవికారశాంతి.

శ్లో॥ మేఘనాదరసో గ్రాహ్యాంశర్కరాయుక్తపానతః । ఉచ్చటాయావికారస్యశాంతిస్స్యాద్దుగ్ధసేవనాత్ ॥

తా॥ చిత్రికూరరసములలో శర్కరకలిపి త్రాగినను, లేక ఆవుపాలు త్రాగినను, గురిగింజలవికారము శమించు.

శ్లో॥ మధుఖర్జూరమృద్వీకావృక్షామ్లామ్లాచదాడిమా । పరూషైరామలకైశ్చైవయుక్తాస్సద్యోవికారనుత్ ॥

తా॥ తేనె - ఖర్జూరము - ద్రాక్షపండు - పుల్లప్రబ్బలి - చింతపండు-దాడిమపండు - పేరీతపండ్లు - ఉసిరికెకాయలరసము - వీటినిసమముగ నేకముగావించి పానముజేసిన గురిగింజభక్షణచే జనించిన వికారము శమించు.

పోకలుమొదలగువానివికారశాంతి.

శ్లో॥ పూగీఫలంజడేశీతవస్త్రవాతోహితంభవేత్ । శర్కరాభక్షణేదేయామధువాశర్కరాన్వితమ్ ॥

తా॥ వక్కలభక్షించుటచే సొక్కుగలిగెనేని యదిశమించుటకై శీతోదకములో తడిపిన వస్త్రముయొక్క గాలిని సేవించవలయు - మరియు శర్కరనేనిలేక తేనెలో కలిపిన శర్కరనేని, సేవించవలయు-

కోద్రవధాన్యవికారశాంతి.

శ్లో॥ కోద్రవాశ్శాంభవేన్మూర్ఛాదేయంక్షీరంసుశీతలమ్ సగుడఃకూష్మాండకరసోహంతిమద్యసకోద్రవమ్ ॥

తా॥ ఆరికె అన్నమునుభుజించినందుచే మూర్ఛగలిగెనేని యదిహరించుటకై అపుడు పితికిన ఆవుపాలనేని బెల్లములో బూడిదెగుమ్మడు కాయరసమును గలిపియేని పానముజేయవలయు - అందుచే కోద్రవధాన్యవికారము శమించు.

తా ॥ త్రిఫలములు - శ్రీగంధను - కోష్టు - అల్లము- వీటిని చూర్ణము చేసి నేతి లోకలిపి పానలేపనములు జేసిన కందురీగ- తేనెటీగ మొదలగువాని కాటుచే జనించిన వికారము హరించు.

## సర్పాదివిషశాంతి.

శ్లో ॥ గోజిహ్వాఫణినీశక్రివారుణీనాతిపర్ణికా । ఏకైకా పాన మాత్రేణ సర్పాదగరళం హరేత్ ॥

తా ॥ ఎద్దునాలుకచెట్టు - తరిగొట్టు - అగసి - వెక్కుడుతీగ - వీనిలోదేని రసము నేని పానము జేసిన సర్పములు మొదలగువాని విషము హరించు.

శ్లో ॥ సగ్రామఠావచాపృష్టా కరబాహుప్రలేపనాత్ । ఘటసర్ప స్త హాగ్రాహ్యోనదంశతికదాచనః ॥

తా ॥ ఇంగువ - వస - వీటిని ఉదకముతో జక్కగనూరి హస్తబాహువులకు చక్కగలేపనము జేసికొనిన ఘటసర్పకాటుచే జనించిన విషదోషము హరించుటయే గాక మరల యెపుడును సర్పదష్టము గలుగకనుండు.

శ్లో ॥ యథాఖలస్య నైవమ్యాత్పీడితో యాతిసజ్జనః । తథా వచా యాధూపేనగృహంముక్త్వావ్రజేద్గృహీ ॥

తా ॥ గృహమున సర్పమును గాంచుటచే భయము జెందెడి సజ్జనులు ఒకసేరు వసను ధూపము వేసిన వాస్తుసర్పము మొదలగునవి శీఘ్రముగ పలాయనంబులగు.

శ్లో ॥ తుత్థంచో గ్రామఫలం గోదుగ్ధేంచపానయేత్ । తస్మాత్స ర్పవిషంయాతితథోషణఘృతేనచ ॥

తా ॥ మైలుతుత్తము - వస - మ్రిగకాయలు - వీటిని తగుమాత్రముగ గ్రహించి యుదకముతో నూరి ఆవుపాలలో కలిపి పానము జేసిన వమనంబై సర్పవిషము హరించు. మరియు మిరియాలను చూర్ణము చేసి నేతిలో కలిపి యుష్ణము జేసి భక్షించిన సర్పవిషము హరించు.

## శ్వానవిషశాంతి.

శ్లో ॥ శ్వానస్యాపివిషంహంతి లేపంకుక్కుటవిష్ఠయా । గుడైస్తైలార్కదుగ్ధైశ్చ లేపశ్వానవిషంహరేత్ ॥

తా॥ కుక్క కరచిన స్థలంబున కోడిమలము నైనను. లేక - బెల్లము - తైలము జిల్లేడుపాలు - వీటిని నేకముజేసినైనను, లేపనము జేయుచుండిన కుక్క కాటు విషము హరించు.

శ్లో॥ ఉన్మత్తశ్వానదంష్ట్రాణాంతుమార్దీదళసైంధవమ్ । సుఖోష్ణాపః పిబేత్ప్రాతస్త్రిదినాం తేసుఖావహః ॥

తా॥ నెయ్యి - కలుబందరసము - వీటిని నేకము జేసి కించిదుష్ణముజేసి సాంగశీతలమున నందొకింత సైంధవలవణము కలిపి మూడుదినంబులు ప్రాతస్సాయంకాలంబులయందు త్రాగిన వెఱ్ఱికుక్క కాటువిషము హరించు.

శ్లో॥ తైలంతిలానాం పలలంగుడంచక్షీరంతథార్కస్యసమమేవపీతమ్। ఆలర్కముగ్రంవిషమాశుహంతిసర్వోద్భవంవాయురివాభ్రబృందమ్॥

తా॥ వెఱ్ఱికుక్క కాటుచే క్షీణింపుచుండెడి నరుడు నూనె-నువ్వులచూర్ణము-బెల్లము-జిల్లేడుపాలు- వీటిని నేకముజేసి త్రాగిన వెఱ్ఱికుక్క కాటుచే జనించిన విషముహరించు-మఱియు జిల్లేడుపాలు, జెముడుపాలు, తెల్లగడ్డలు, వసనాభిమొదలగు వాని సేవనచే దోషముజనించినందువలన కృశింపుచుండెడినరుడు పైజెప్పిన ద్రవ్యములను శరీరమునకు లేపనము జేసికొనిన నదిహరించు.

శ్లో॥ యత్ర్యాంశుకరర్కమూలంచమరిచంకర్షభక్షణాత్। తద్వ్రణంతత్క్షణాదేవదహేల్లోహశలాకయా॥

తా॥ గుమ్ముడువేళ్లు (౨) తులములు - మిరియాలు (౨) తులములు - వీటిని యుదకముతో నూరి ముద్దచేసి ప్రతిదినంబును భక్షింపుచుండిన వెఱ్ఱికుక్క కాటుచే గలిగిన వ్రణము శీఘ్రముగ మానును - మఱియు కరచిన స్థలంబున తత్క్షణంబున నే యినుపశలాకుతో రత్షలు వేయవలయును.

దుష్టజంతువికారశాంతి.

శ్లో॥ విశంక్రౌంచజలేష్పష్ట్వానిత్యంపిబతియోనరః । తస్యోదరేదుష్టజంతోర్విశంనశ్యతితత్క్షణాత్ ॥

తా॥ క్రౌంచపక్షిమలములను జలముచేనూరి ప్రతిదినము పానము సేయుచుండెడి నరుని దుష్టజంతువులు కరచినను వానివిషము శీఘ్రముగినశించు.

వృశ్చికవిషశాంతి.

శ్లో॥ హింగుశ్చార్కపయోఘృష్టో దంశోపరిచదాపయేత్। వృశ్చికస్యవిషంహంతిరజనీంచ్యపతిర్యథా॥



తా॥ మంచియింగువ - జిల్లెడుపాలు - వీటిని సమముగనూరినృశ్చికదష్టమై నస్థలంబునపదేపదేలేపనము చేయుచుండిన "సూర్యుడు వుదయించుటచే అంధకారముతొలంగుభంగి" వృశ్చికవిషము హరించు.

శ్లో॥ బాణపుంఖరసోపేతో మేఘనాదరస స్తథా।శర్కరాసహితంపానంవిషంవృశ్చికజంహరేత్ ॥

తా॥ వెంపలిరసము - చిత్రికూరరసము - కలకండ - వీటినినేకముజేసి పానముజేసిన వృశ్చికవిషముహరించు.

## గృహగోధికావిషశాంతి.

శ్లో॥ కటుత్రయంసింధుకరంజబీజంద్వయంనిశాయాః కపికచ్ఛబీజమ్। సహంతిపానేనవిలేపనేనవిషంసమస్తంగృహగోధికాయాః॥

తా॥ శొంఠి - పిప్పలి - మిరియాలు - సైంధవలవణము - కానుగవిత్తులు-పసపు - మానిపసపు - దురదగొండివిత్తులు - వీటిని ఉదకముతోనూరి త్రాగినను-లేక లేపనము జేసికొనినను, గృహగోధిక (బల్లి) మొదలగువాని విషదోషములు హరించు.

## శరటవిషశాంతి.

శ్లో॥ అర్కమూలంవచాచూర్ణంపీతంశీతేనవారిణా। తస్యశరటవిషంసద్యశ్శాంతిర్భవతినిశ్చితమ్ ॥

తా॥ జిల్లేడువేరు - వస - వీటినిచూర్ణముజేసి శీతోదకముతో పానముచేసిన తొండలుకరచినందుచే జనించినవిషదోషము హరించు.

## మూషకవిషశాంతి.

శ్లో॥ సితాయాఃపలమానంతుబాణపుంఖరసఃఫలమ్ । యఃపిబేత్ప్రాతరుత్థాయమూషకస్యవిషాపహమ్ ॥

తా॥ రెండుతులముల కలకండలో రెండుతులముల వెంపలిరసముకలిపిప్రాతఃకాలంబున మేల్కొనినతోడనే త్రాగిన యెలుకకాటుహరించు.

## శ్వేతమూషకకృతగ్రంధివిషశాంతి.

శ్లో॥ ఊర్ధ్వాత్తుపతితంమూషంశ్వేతవర్ణంసుదారుణమ్।పాతస్థానేభవేద్గ్రంధిస్సాగ్రధిర్మృత్యుదాయికా । శస్త్రేణగ్రంధింవిస్ఫోట్యాఖరస్యశకృతంక్షిపేత్। తేనదుష్టస్యగ్రధితోవికృతేశ్శాంతికృద్భవేత్ ॥

తా॥ అతిదుష్టమగు శ్వేతమూషకను ఊర్ధ్వంబుగనుండి శరీరముమీద పడె నేని నచట గ్రంథులు జనించిమరణంబుగలుగు - గావున గ్రంథులు జనించిన తోడనే వానిని శస్త్రముచే గొంచెముగ గీచి నందుగాడిదెపెంటికలను లేపనము చేసిన యా గ్రంథులు శమించు.

సింహబాలవిషశాంతి.

శ్లో॥ మధోశ్చపలమానంతుదినంవింశతియఃపిబేత్ । తస్యసింహస్యబాలస్యవిషంనస్యాత్కదాచన ॥

తా॥ పూటకుపలప్రమాణము చొప్పున యిరువదిదినములు తేనెను పానము జేసిన వ్యాఘ్రరోమ జంతువిషము నివృత్తియగు.

భ్రమరమక్షికయోర్విషశాంతి.

శ్లో॥ మహిషీనవనీతంచటంకణైస్సహమర్దయేత్। మాక్షికభ్రమరస్యాంతంనాగఫేనేనతత్సమమ్ ॥

తా॥ బర్రెవెన్న - వెలిగారము - వీటిని సమముగ నేకముచేసిమర్దించి శరీరమునకు లేపనముజేసికొనిన తుమ్మెదలు, అడవియీగెలు మొదలగు దుష్టజంతువుల కాటుచే జనించిన విషవికారము సగాహరించు. మరియు, నల్లమందుచేజనించిన వికారము సగాహరించు.

కర్ణప్రవేశజోరీగలు మొదలగువానికిశాంతి.

శ్లో॥ కర్ణప్రవేశేఖర్జూరతత్కర్ణేమూత్రకంక్షిపేత్ । తథాచతిలతైలంచథంకేవత్సస్యశ్లత్థకమ్ ॥

తా॥ గోమూత్రము -మంచినూనె వీటినినేకముజేసి కించిదుష్ణము చేసియైనను లేకఅవుదూడపేడలో రసముతీసియైనను, చెవిలోవేయుచుండిన చెవిలో జోరీగలు మొదలైనవి ప్రవేశించినందుచే జనించు వికారములు హరించు.

శ్లో॥ జిహ్వయాస్తాలుకాయోగాదమృతం స్రావయేత్తుయత్। విలిప్తంతేనథంనస్యనిర్విషంక్షణమాత్రతః ॥

తా॥ వనమక్షికములు కరచినస్థలంబునలేచినదద్దులకు మనుజులయొక్క జొల్లును లేపనముజేసిన నవితోడనే నదృశ్యంబులగు.

మూషకాద్యల్పజంతువిషశాంతి.

శ్లో॥ భల్లాతకఫలంముస్తాకపికచ్ఛుఫలంతథా । రాలసిద్ధార్థ

వీతేషాంచూర్ణధూపప్రభావతః । మూషకామశకామక్షిమత్కుణా విష
కీటకాః । పలాయంతేగృహంముక్త్వాయథాయుద్ధేతికాతరాః ॥

తా ॥ జీడిగింజలు - జిల్లేడుకాయలు - తుంగముస్తెలు - తీటకోవెలకాయలు - యక్షధూపము - తెల్ల ఆవాలు - వీనిని చూర్ణముచేసిగృహములోధూపమువేసిన "యుద్ధమున పిరికితనముగలవారు బెదిరిపోవునట్లు" ఎలుకలు, దోమలు ఈగలు - నల్లులు, విషజంతువులు, ఇవి పలాయనంబులగు.

శ్లో ॥ అర్కమూలంచవార్తాయాభావితంహ్యగ్నినాసహ। కటు
తైలాక్తదీపస్థా నిశాయాంమత్కుణాపహా ॥

తా ॥ జిల్లేడువేరుపట్ట - వార్తాయమూలము - వీటిని ఎఱ్ఱచిత్రమూలపురసము లో భావనచేసి యందావనూనెకలిపి దానిలోవత్తినితడిపి రాత్రులయందు దీపమువెలిగించిన నల్లులునశించు.

యూకాదిదంశనవిషశాంతి.

శ్లో ॥ శ్రీమూలంగోజలేఘృష్ట్వాదేహే లేపంచకారయేత్ ।యూ
కాచలిక్షకాసావానాశయంత్యపితత్క్షణాత్ ॥

తా ॥ మారేడువేరును గోమూత్రములో గంధముతీసి దేహమునకులేపనము జేసికొనిన పేలు, ఈరు, చీరపేలు, మొదలగు సమస్తస్వేదజములుతోడనే నశించు.

శ్లో ॥ శిలాగంధకగోమూత్రవిడంగంకటుతైలతః । ఏషాంలేపే
భవేచ్ఛాంతిస్నానాయూకాచలిక్షకా ॥

తా ॥ శిలాజిత్తు - గంధకము - వాయువిళంగములు - వీటినిచూర్ణముచేసిఅందు గోమూత్రము, ఆవనూనెకలిపి శరీరమునకు లేపనముజేసికొనిన పేలు, ఈరులు, చీరపేలుమొదలగునవి యన్నియు నశించు.

భ్రమరకృతజలోదరరోగశాంతి.

శ్లో ॥ షట్పాదేచోదరేప్రాప్తేజలోదరఃప్రజాయతే । తస్యశుక్తి
ప్పలీదేయావికృతేశ్శాంతికృత్సదా ॥

తా ॥ ఉదరములో తుమ్మెద ప్రవేశించుటచే జలోదరరోగము జనించు - కావున ప్రత్యహము పిప్పళ్లుసేవింపుచుండిన తుమ్మెదల దోషజనిత వికారముశమించు.

సర్వవిషములకు అనుపానము.

శ్లో ॥ తైలంచామ్లంతథాన్నిద్రాంవర్జయేద్విషపీడితః । తండులం
ఘృతదుగ్ధంచశ్రేష్ఠపథ్యంవిషాతురే ॥

తా॥ నూనె, పులుసు, నిద్ర మొదలగువానిని విషపీడితులువర్జింపవలయు. ఆట్టి వారికి బియ్యపుఅన్నము - నెయ్యి - ఆవుపాలు - యివి హితకరంబులుగనుండు.

శ్లో॥ ధాతో స్తథోపధాతోశ్చవిషంస్థావరజంగమమ్ । సర్వే షాంవమనం శ్రేష్ఠంవిరేకశ్చతథైవచ ॥

తా॥ ధాతూపధాతుజనితవిషవికారములకును, స్థావరజంగమాదివిషవికారములకును వమనవిరేచనములకివ్వవలయు.

సమస్తవిషవికారములకు సామాన్యౌషధము.

శ్లో॥ జ్ఞాతాజ్ఞాతాధికారేషుసదాదేయంచభేషజమ్ ।సితామధుఘృతపయస్తండులంబూహివషంశకృత్ ॥

తా॥ కలకండ - తేనె - నెయ్యి - పాలు - బత్తెపేడరసము ఇవి సందిగ్ధవిషములకు హితకరములుగనుండు.

శ్లో॥ పృథక్పృథక్సదాదేయంశ్వానస్యచవిషంవినా । ఆలర్కే రూక్షమన్నంచజలంపశ్చాత్పలాండునా ॥

తా॥ వెఱ్ఱికుక్కవిషమునకు తప్ప యితరఅన్నివిషములకును పైజెప్పినకలకండ మొదలగువానిని వేర్వేరుగనివ్వవలయు - మఱియు వెఱ్ఱికుక్కవిషమునకు పేడియన్నము - ఎఱ్ఱగడ్డలరసము, ఇవిహితకరములుగనుండు.

ఇత్యనుపానమంజర్యాం జంగమవిషశాంతి ప్రకరణంనామ చతుర్థస్సముద్దేశః.

---

ధాతూపధాతుమారణరోగానుపానప్రకరణము.

శ్లో॥ అథధాతస్సంప్రవక్ష్యామిధాతూపధాతుమారణమ్।రోగా ణామనుపానంచసంక్షేపాత్కథ్యతేధునా ॥

తా॥ ఇకధాతురూప ధాతుమారణంబులను, రోగానుపాన విశేషంబులను సంక్షేపముగ వచియించెద.

పారదోత్పత్తి.

శ్లో॥ స్కందాత్తారకహింసార్థంకైలాసేప్రార్థితస్సురైః । కరుణాత్మామహాదేవఃపార్వతీవల్లభశ్శివః। రతౌశ్శంభోశ్చ్యుతంరేతోగృహీతంవహ్నినాముఖే । క్షిప్తంతేనచతుర్దిక్షుమాయాంతత్పృథక్పృథక్

సౌమ్యాదిదిక్త్రియస్యాం తేగౌరీశాపాన్న కార్యకృత్ । పశ్చిమాయాం తుయత్కిప్తం సదిశత్సర్వకార్యకృత్ । ఏషోత్పత్తిస్సమాఖ్యాతా పారదస్యమనీషిభిః ॥

తా ॥ తారకాసురవధార్థమై కార్తికేయుని జనింప జేయవలయునని కరుణాత్ముండును, పార్వతీవల్లభుండును నగునీశ్వరుని దేవేంద్రుడు మొదలగు సమస్తదేవతలు ప్రార్థించిననతండు కార్తికేయజనననిమిత్తమై పార్వతితో సంయోగము జేయ నెవ వీర్యము పతనంబయ్యె - దానిని అగ్ని గ్రహించి దానిని భరింప నేరక భూమియందు విడిచిననది నలుదిక్కులయందు వ్యాపించె. ఉత్తరదిశయందు పడినరసము గౌరీశాపముచే నిష్ఫలంబగుటంజేసి నదియేకార్యమందు నుపయోగింపదనియు, పశ్చిమదిశయందు పడినరసము సమస్తకార్యములకునుపయోగించుననియు, ఆయుర్వేదవేత్తలువచించెదరు.

పాదరవర్ణభేదములు.

శ్లో ॥ శ్వేతవర్ణోద్విజస్స్యాతో రక్తఃక్షత్రియసంజ్ఞకః । పీతవర్ణో భవేద్వైశ్యఃకృష్ణాస్తుశూద్రజాతయః ॥

తా ॥ శ్వేతవర్ణముగలరసము బ్రహ్మజాతియనియు, రక్తవర్ణముగల రసముక్షత్రియజాతియనియు పీతవర్ణముగలరసము వైశ్యాజాతియనియు కృష్ణవర్ణముగలరసము శూద్రజాతియనియు పలుంగు.

శ్లో ॥ నాగోవంగోమలోవహ్నిశ్చాంచల్యంచవిషంగిరిః । అసహ్యాగ్నిర్మహాదోషాస్స్వభావాత్పారదేస్థితాః ॥

తా ॥ పాదరసమునస్వాభావికముగ నాగ, వంగ, గిరి, అసహ్యాగ్ని, మొదలగుమహాదోషంబులుగలవు - అవి నివారించుటకై అష్టాదశసంస్కారములజేయవలయు.

పాదరసగుణము.

శ్లో ॥ సూతష్షడ్రసయుక్తిదోషశమనస్సర్వామయధ్వంసకృత్ । కాంతాకామవిమర్దనోతిబలకృత్సిద్ధిసుధాయాశ్శివః । చక్షుష్యస్స్మృతిపదోమరణహృద్వ్యాధిక్యజిద్వృద్ధికృత్ । జాడ్యఘ్నంకృమికుష్ఠహాకనకకృత్సంయోగవాహీరసః । శుష్కేంధనమహారాశిం యద్వద్దహతిపావకః । తద్వద్ధాతుగతాంసూతోరోగాన్దోషత్రయోద్భవాన్ ॥

తా ॥ పాదరసము షడ్రసములతో గూడినదై త్రిదోషశమనకారిగను, ఆమసంబంధ దోషముల హరింపంజేయునదిగను, కామమును వృద్ధిచేయునదిగను, కడుబల

కారిగను, అమృతతుల్యముగను, శివస్వరూపిగను, చక్షురింద్రియమునకు ప్రకాశము గలుగంజేయునదిగను, స్మృతి - రూపము, వీటినిగలుగంజేయునదిగను, మృత్యువు- ముదిమి, వీటిని జయించునదిగను, శరీరవృద్ధిని గలుగంజేయునదిగను, జాడ్యము, కృమి, కుష్టు, వీనిని హరింపజేయునదిగను, కాంతినిగలుగంజేయునదిగను, అనుపానములచేసమస్తరోగములను నశింపజేయునదిగను, నుండుటయేగాక "అగ్ని యెండిన కష్టలసమూహమును దహించుమాటికి" ధాతుగతత్రిదోషంబులను దహింపంజేయు.

## హింగులోత్థరసము.

శ్లో ॥ జంబీరనింబనీరేణమర్దితంహింగుళందినమ్ । ఊర్ధ్వపాతనయంత్రేణగ్రాహ్యస్సూతస్సునిర్మలోరసః । కంచుకైర్నాగవంగాద్యైర్నిర్ముక్తోరసకర్మణి ॥

తా ॥ ఎనిమిదితులముల యింగిలీకమును నిమ్మపండ్లు, పారిజాతము, వీటిరసములతో ఖల్వమున నొకదినము మర్దించి యెండ నెండించి పిదప దానిని నొకగట్టికుండలో నునిచి పైన మఱియొకకుండబోర్లించిచీలమన్ను చేయుటచే ఊర్ధ్వపాతన యంత్రమని పఱంగెడు నాకుండలను గాఢాగ్నిచే రెండుఝాములు వండుటయగాక పైకుండమీద తడిపినవస్త్రమునుచుట్టి దానిపైకొంచ కొంచముగ శీతోదకమును పదేపదేప్రోక్షింపుచుండవలయు - ఇటులంజేసిన నారసము పైకుండకెగసి ధూమాకారముగవ్యాపించి యుండు-పిదప నాయూర్ధ్వపాతనయంత్రమునుస్వాంగశీతలమునగ్రహించినదానికి జేసియుండెడి చీలమన్నును బహుజాగ్రతగ నూడదీసి పైకుండలో ధూమాకారనుగవ్యాపించి యుండురసమును వరాహకట్టెతోగీచుచుండిన నంతరసముజనించు- పిదపనారసమును నాలుగుమార్లేని, అయిదుమార్లేని, వస్త్రముతోవడియకట్టిననదినాగవంగాదిసప్తకంచుకదోషరహితంబునగు. ఇట్టిరసమును సర్వౌషధములయందు నుపయోగింపందగు.

## రసశుద్ధిక్రమము.

శ్లో ॥ జంబీరోత్థదినేనైవపారిభద్రద్రవేణవా । యామంసమ్మర్దయేత్తేనరసశ్శుగ్రాహ్యస్సునిర్మలః ॥

తా ॥ పైరసమును ఖల్వమునవైచి నొకఝాముపరకు నిమ్మపండ్లరసముచేనేని, పారిజాతపత్రరసముచే నేని, మర్దించి యెండనెండించిన శుద్ధియగు.

వాక్యమ్ ॥ ఊర్ధ్వపాతనాదివిశిష్టపారదేనపుంసకత్వమస్తీతదుక్తంబోధనసంస్కారేతస్మాత్ ॥ బలప్రకర్షాయచడోలికాయాంశ్వేదోప్యరసస్సైంధవచూర్ణగర్భే ॥

తా ॥ ఊర్ధ్వపాతరసములకన్నిటికిని పుంసకదోషముగలదు. అదినివృత్తించుటకై యొకకుండలో సగము నీళ్ళుబోసి యందొకసేరు సైంధవలవణమును నూరి కలిపి దృఢమయిన వస్త్రమును నాలుగుమడతలుగ మడిచి యందు నింగిలీకరసము నునిచి దారముతో గట్టిగ మూటగట్టి దానిని పైసైంధలవణము జలములో మునుగునటుల కట్టి యందలి జలమిగురువరకు ఆరుజాముల గాఢమధ్య మృద్వగ్నులచే డోలాయంత్రమున వండవలయు - ఇదేప్రకారము రేండవదినము సగా జేయవలయు. ఇటుల జేసిన రసము నిర్దోషముగనగు.

షాముాన్యషడ్గుణబలిజారణము.

శ్లో ॥ క్షుద్రభాండే రసం కృత్వా వాలూకాయంత్రమధ్యమమ్। షడ్గుణం గంధకం తత్ర క్షిపేదల్పాల్పకం శనైః । తైలరూపో యథా గంధస్తథా తావ జారయేద్ధ్రుతమ్ । సాంగశీతో దృఢో గంధే సోత్థితో యిత్వా రసం నయేత్ । సర్వరోగేషు దాతవ్యో రసో వ్యాధి నిసూదనః ॥

తా ॥ ఒకచిన్నకుండను యిసుకతో పూరించి దాని మధ్యమున ఇంగిలీక రసముగల మరియొకచిన్నకుండనునిచి పొయిమీద బెట్టి మధ్యనునిచిన కుండయందలి రసము పైశుద్ధి జేసిన గంధకచూర్ణమును వేయుచుండవలయు - ఇటులవేసిన గంధకము కరిగిన తోడనే మరల గంధకములను వేయవలయు - ఇట్లాగున రసము ఆరింతల గంధకమును భక్షించునటుల జేయుటయు షడ్గుణగంధక జారణమనంబడు - ఇట్టిరసమును సమస్త రోగములయం దుపయోగించుట మిగుల శ్రేష్ఠమని ఆయుర్వేదవేత్తలు వచించెదరు.

జారణఫలము.

శ్లో ॥ సర్వపాపక్షయేజాతే ప్రాప్యతే రసజారణాత్ । తత్ప్రాప్త్యా ప్రాప్యతే చైవం స్యాద్విజ్ఞానం ముక్తిలక్షణమ్ । యావద్దినాని వహ్నిస్థో జారణే ధార్యతే రసః । తావద్వర్షసహస్రాణి శివలోకే మహీయతే ॥

తా ॥ రసజారణచే సర్వపాపక్షయంబును, భుక్తిముక్తులును, విశేషజ్ఞానంబును, రసజారణనిమిత్తము, అగ్నిని యెన్నిదినములు స్థాపించెదరో అన్ని సహస్ర వత్సరములు శివలోకప్రాప్తియుగలుగునని పరమేశ్వరుడు వచించె.

శ్లో ॥ దినమేకం రసేంద్రస్య యో దదాతి హుతాశనమ్ । ద్రవంతి సర్వపాపాని కుర్వన్నపి న లిప్యతే ॥

తా ॥ రసమునందు నొకదినము అగ్నిదానము చేసెడినరుడు వ్యక్తి సంపూర్ణభూతుడై సర్వపాపవిముక్తుడగు.

శ్లో ॥ శుకపుచ్ఛసమః ప్రాయోనవనీతసమప్రభః । మస్పృణఃకఠిన స్నిగ్ధోగంధకశ్శ్రేష్ఠఉచ్యతే ॥

తా ॥ చిలుకపుచ్ఛమువంటివర్ణంబును - వెన్నవలెమృదువుగను, చిక్కన పాక ముగలదిన్నై కఠిన స్నిగ్ధములుగను, నుండెడి గంధకము శ్రేష్ఠంబని ఆయుర్వేద వేత్తలు వచించెదరు.

గంధకశుద్ధి.

శ్లో ॥ లోహపాత్రేవినిక్షిప్యఘృతమగ్నౌప్రతాపయేత్ । తప్తే తప్తేతత్సమానంప్రక్షిపేద్గంధకంరజః । విద్రుతంగంధకంజ్ఞాత్వాదుగ్ధమ ధ్యేసిదాపయేత్ । ఏవంగంధకశుద్ధిస్స్యాత్సర్వకార్యేషుయోజయేత్ ॥

తా ॥ లోహపాత్రములో నొకింత గంధకచూర్ణమును నేతినివైచి నిప్పులమీద నునిచి కరిగించి పిదప శేషించిన గంధకచూర్ణమును అందువైచి నది ద్రవించినతోడ నే దానిని ఆవుపాలలోబోసిన శుద్ధియగు - ఇట్టిగంధకమును సర్వౌషధములయందు నుపయోగింపందగు.

ధాతుసంఖ్య.

శ్లో ॥ కనకతారకతామ్రకతీక్ష్ణకత్రపుభుజంగమారకమేవచ । ఇతివదంత్యపిధాతుగణంబుధాస్సకలశాస్త్రమతేవ్యతివిస్తరాత్ ॥

తా ॥ సువర్ణము, రౌప్యము, తామ్రము, లోహము ఇనుము, సీసము వంగ ము అనునవి ధాతుగణంబులని ఆయుర్వేద వేత్తలు శాస్త్రములయందును వక్కా ణించెదరు.

సువర్ణసంఖ్య.

శ్లో ॥ ప్రాకృతంసహజవహ్నిసంభవంహ్యాకరోద్భవరసేంద్రవే ధజమ్। హేమపంచవిధమాహురాడరాద్బాలబోధనవిధానకారణాత్॥

తా ॥ సువర్ణము ప్రాకృతము, సహజము, అగ్నిసంభవము, ఆకరోద్భవము రసేంద్రవేధము, అన నైదువిధములుగ బాలబోధార్థమై చెప్పబడియె.

సువర్ణపరీక్ష.

శ్లో ॥ యద్ధేమతప్తంశుచివహ్నియోగాచ్ఛ్వేతంసురక్తం యదివా కరస్థం । గ్రాహ్యంచశుభ్రత్వమధోభజేద్యత్త్యాజ్యంసువర్ణంభిషజాం పరైస్తత్ ॥

తా ॥ ఏసువర్ణమును అగ్నిలో కాచిన శీతలముగను – ఎఱుపువర్ణముగలదిగను ఉండెడినో యది ఆకరోద్భవమని యెరుంగవలయు. ఇట్టిదానిని ఔషధములయందు గ్రహింపదగు – ఏసువర్ణమును అగ్నిలో కాచిన శుభ్రవర్ణముగలదిగనుండెడినో దానిని ఔషధములయందు వర్జింపవలయును.

సువర్ణశుద్ధి.

శ్లో ॥ తైలేతక్రేకాంజికేధేనుమూత్రేకౌలత్థానాంసంతపాచే ర్కదుగ్ధే । హేమశుద్ధిర్జాయతేకాంచనారేతప్తంతప్తం దాహయేత్సప్తవారాన్ ॥

తా ॥ సువర్ణపురేకులను అగ్నిలో తప్తముచేసి తైలము, మజ్జిగ, పులికడుగు గోమూత్రము, ఉలవకట్టు, జిల్లేడుపాలు, కాంచనారరసము, వీనిలో ప్రతిదానియందును ఏడేడు మార్లు ముంచిన నది శుద్ధియగు:

సువర్ణమారణము.

శ్లో ॥ తపనీయరసోభుజంగమస్యారసకేన విమర్దపి షోడశాంశే సహచామ్లజలేనచూర్ణమేతత్పరిదృష్ట్వాశుభగోలకోవిధేయః । సుశరావపుటేపిగోలతుల్యాశుభగంధఃపరిగోలమోచనీయః । అధరోత్తరమాశు సంపుటాస్యంపరిరుద్ధ్వాపరిపాచనేత్సువహ్నౌ ॥వృషత్రింశ వనోపలాస్సుషాకైఃపరిదేయాస్సతతంపుటేపుటేచ । అపిసప్తపుటైస్సుశుద్ధమేవంపరిసంజాయతఏవహేమభస్మ ॥

తా ॥ సువర్ణమును రేకుడిచేసిమంచిఖల్వమునవైచి దానికి షోడశాంశము తమలపాకులరసము, చింతపులుసు, కొంచముగ నల్లికాయల పులుసువైచి మర్దించి ఉంటజేసి దానికి సమముగ శుద్ధచేసిన గంధకమునుగ్రహించి చూర్ణముచేసి యొక మూసలో సగము గంధకమునువైచి దానిపై యాఉంటనునిచి దానిపై శేషించినగంధకమువైచి పిదప దానిమూతిని చిల్లపెంకుచేమూసి చీలమన్నుజేసి యెండించి పిదప దీని నొక శరావమునసునిచి పచనముజేయవలయు. పిదప దానిని అందుండితీసి మరలపై ప్రకారముచేసి ముప్పదియేరుపిడకలతో పుటంబడవలయు – ఇటులనేడు పుటంబులిడిన సువర్ణము నిర్దోషముగ భస్మంబగు.

సువర్ణభస్మగుణము.

శ్లో ॥ మృతంహాటకందివ్యకాంతింతనోతిక్షతశ్వాసకాసక్షయం

పిత్తవాతౌ । ప్రమేహగ్రహణ్యాతిసారంచకుష్ఠంజ్వరంహంతిఛాఖండకం దర్పదంచ ॥

తా ॥ శుద్ధసువర్ణభస్మము, గాయము, కాసశ్వాసలు, క్షయము, వాతము, పిత్తము, ప్రమేహము, సంగ్రహణి, అతిసారము. కుష్టువు, జ్వరములు. వీటిని నశింప జేయుటయే గాక దివ్యమైన కాంతిని మిగుల కామవృద్ధిని సగా గలుగంజేయు.

శ్లో ॥ స్వర్ణాంతిక్తంకషాయంమధురమతిపయఃస్థాపనంకాంతిదంచ । వృష్యంహృద్యంచబల్యం రుచికరమఖిలంవాగ్విశుద్ధిప్రదంచ । ఆయుర్దంవైఫలీనాంహరణమచిరతో నాశనందుర్విషాణామ్ । రోగేశోన్మాదమాంద్యజ్వరపరిహరణంసర్వరోగాధినాశమ్ ॥

తా ॥ సువర్ణభస్మము చేదు వగరు, మధురము, గలదిగను ముదిమిని నశింపజేయునదిగను, కాంతి, వీర్యవృద్ధి, మనస్సంతోషము, బలము, రుచి, మిగుల బుద్ధి వాక్పటుత్వము, ఆయుర్వృద్ధి వీనిని గలుగంజేయునదిగను, శీఘ్రముగ ముదిమి, దుష్టవిషము, ఉన్మాదము, జ్వరము, మొదలగు సమస్తరోగములను నశింపంజేయునదిగను నుండు.

## పక్వగుణము.

శ్లో॥ స్వర్ణంవిదత్తేఖిలరోగనాశంకరోతిసౌఖ్యంప్రబలేంద్రియత్వమ్। శుక్రస్యవృద్ధింబలతేజవృద్ధిం క్రియాసుయుక్తించయుతంచహేమమ్॥

తా ॥ దోషరహితమగుసువర్ణభస్మము సమస్తరోగ నాశనంబును, ఇంద్రియములకు దృఢత్వమును, శరీర సౌఖ్యమును శుక్రబలతేజో వృద్ధులను సమస్త శోధనాది క్రియలను జేయునదిగనుండు.

## అపక్వదోషము.

శ్లో ॥ బలంచవీర్యంహరతేనరాణాంరోగవ్రజంపోషయతీహకాయే । అసౌఖ్యకారశ్చసదైవ హేమ్నఃఅపక్వదోషాన్మరణంకరోతి ॥

తా ॥ దోషముగల సువర్ణభస్మసేవనచే బలవీర్యముల నాశనంబును, శరీరమున రోగప్రాబల్యంబును, సదా అసౌఖ్యంబును, మరణంబును, గలుగు.

## రౌప్యభేదములు.

శ్లో ॥ త్రివిధం పరికీర్తితంచరూప్యంఖనిజం వంగజవేధజేతథైవ అపలోక్యరసాదధీంశ్చగృధ్నాశ సకలైర్వ్యావికారదైశ్చ ॥

తా॥ రౌప్యము ఆకరోద్భవ, వంగోద్భవ, వేధోద్భవములని త్రివిధంబులుగ నుండునని రసోదధి ఆనుగ్రంథముల నవలోకనజేసిన వైద్యవేత్తలు వచించెదరు.

రౌప్యపరీక్ష.

శ్లో॥ ఉభేదంగజంవేధజంచైవగ్రాహ్యాయతో వైస్తుశుభ్రత్వమేకంమృదుత్వమ్ । అతోగ్రాహ్యమేవంఖనిస్థంచ రూప్యంతశ్శ్వేతవర్ణంనకోమాల్యాయయుక్తమ్ ॥

తా॥ వంగజ, వేధజములనుసీరెండు రౌప్యములు కోమలములుగను, శుక్లవర్ణముగను, నుండుటంజేసి నవి గ్రాహ్యంబులుగ నుండుననియు, మాళవదేశోద్భవమగు ఆకరోద్భవము కోమలముగనుండక శ్వేతవర్ణముగ నుండుటంజేసి నది అగ్రాహ్యమనియు, వైద్యవేత్తలు వచించెదరు.

రౌప్యదోషము.

శ్లో॥ తాపోరోధోభ్రాంతివాంత్యౌచరూప్యేదోషాహ్యేషశోధనంకీర్తయుష్యే । తైలేతక్రేసంక్షిపేత్కుంభితో వేతప్తంవారాన్సప్తవర్గేచసప్త ॥

తా॥ రౌప్యమునకు సంతాపము, రోధము, భ్రాంతి, వమనము, ఆనునాలుగు విధదోషంబు లుండుటంజేసి నవి హరించుటకై దానిని ప్రతిమారు అగ్నిలోతప్తముచేసి నూనె, మజ్జిగ గున్ముడు చేకురసము, మూత్రవర్గము, వీనిలో ప్రతిదానియందును యేడేడుమార్లు ముంచవలయు. ఇటులంజేసిన నందలి దోషము హరించు.

రౌప్యమారణము.

శ్లో॥ తారపత్రసమసూతగంధకేకాంజికేనసహితేవిలేపయేత్ । గర్భగుప్తశుభయంత్రకేక్షిపేత్స్వేచమేచ్ఛశిదినేసువహ్నినా ॥

తా॥ పైజెప్పినటుల శుద్ధిజేసిన వెండిని పలచనగ రేకులు జేయించి పిదప దానికి సమముగ శుద్ధిజేసిన పాదరసమును, శుద్ధిజేసిన గంధకమును జేకొని కాంజికములో నూరి ఆవెండి రేకులకు దళము లేపనముజేసి యెండించి స్వచ్ఛాగ్నితో పాకము చేసినను, లేక పిడకలతో గొప్ప పుటంబిడినను, నది భస్మంబగు- పిదప దీనిని యిక్తైలంగుననే నాలుగుమార్లు జేయవలయు.

రౌప్యభస్మగుణము.

శ్లో॥ తారంచతారయతిరోగసముద్రపారం దేహస్యసౌఖ్యకృద్బలంపలితాపహంచ । హంతీహరోగవిషదోషమలంప్రసహ్యావృష్యంపునర్నవతరంకురుతేచిరాయుః ॥

తా ॥ శుద్ధరౌప్యభస్మము సముద్ర సమానంబగు రోగంబులను, ముదిమిని దోషయుక్తమగు విషము రోగములు, దోషములు, వీటిని నశింపజేయుటయేగాక శరీర సౌఖ్యంబును, మిగుల బలంబును, చల్లదనమును, వీర్యవృద్ధిని, గలుగంజేసిచిరకాలమువరకు జీవించి యుండునటులంజేయు.

శ్లో ॥ తారంరోగసముద్రపారగ మహాపిత్తాపహంవాతజిద్గుల్మశ్లేష్మవిషార్తిమేహశమనంత్రూతాంతిసంబాయకమ్ । శ్వాసప్లీహయకృద్వలీపలితజిత్పాండ్వార్తిశోకాపహంకాసక్షీణక్షతక్షయపరిశమనం దీర్ఘాయుషంపుష్టిదమ్ ॥

తా ॥ రౌప్యభస్మము సముద్రమువంటి రోగముల తరింపంజేయదగినదిగను, పిత్తము, వాతము, గుల్మము, శ్లేష్మము, విషబాధ, ప్రమేహము, వాపు, శ్వాస, ప్లీహము, యకృత్తు, ముదిమి, పాండురోగము, శోకము, కాస, క్షీణత్వము, గాయములు, క్షయరోగము, వీటిని నశింపంజేయునదిగను, నుండుటయేగాక ఆయుర్వృద్ధి, శరీరపుష్టి వీనిని సగా గలుగంజేయునదిగనుండు.

## అపక్వదోషము.

శ్లో ॥ తారంచదేహస్యకరోతి తాపంవిడ్గంధతాంయచ్ఛతి శుక్రనాశమ్। అపాటవంవీర్యబలప్రహానింమహాగదాన్పోష యతీహకావే॥

తా ॥ అశుద్ధమగు రౌప్యభస్మము శరీరమున జ్వరతాపము, మలముంబోలిన దుర్గంధము, శుక్రక్షయము, దౌర్బల్యము వీర్యహాని, రోగప్రాబల్యము, వీటినిగలుగంజేయు.

## తామ్రసంజ్ఞ.

శ్లో ॥ మ్లేచ్ఛంచనైపాలమథోవదంతిశుల్బంరసజ్ఞా ద్వివిధంరసేషు । యత్క్షాలనాచ్ఛ్యామతమాచశాంతి స్తత్తామకంమ్లేచ్ఛకమాహవహేయమ్ । యత్క్షాలనాద్రక్తతమాచశాంతిస్తైనపాలకం గ్రాహ్యమథోభిషగ్భిః । అతఃపరంతామ్రసమాశ్రితాంశ్చదోషాంశ్చవక్ష్యేబహుధావిలోక్య ॥

తా ॥ తామ్రము, మ్లేచ్ఛ నేపాళజనితములన ద్వివిధంబుబుగ నుండునని రసజ్ఞులగు వైద్యవేత్తలు వచించెదరు. అందు ప్రక్షాళనము జేసినయు మిగుల శ్యామవర్ణముగ నుండునది మ్లేచ్ఛజాతియనియు, రక్తవర్ణముగనుండునది నేపాళదేశజనితమనియుపఠింగు - అందు కడపటిది శ్రేష్ఠముగ నుండుటచేదానిని గ్రహింపందగు - ఇక తామ్రము నాశ్రయించియుండెడి సర్వదోషంబుల అనేకశాస్త్రముల నవలోకనచేసివచించెద.

## తామ్రదోషము.

శ్లో ॥ వాంతిర్భ్రాంతిస్సంక్లమస్తాపశూలే కండుత్వం నైరేచతా వీర్యహంతా । అష్టౌ దోషాః కీర్తితాస్తామ్రమధ్యే తేషాం సర్వం శోధనం కీర్తయిష్యే ॥

తా ॥ తామ్రమున వాంతి, భ్రాంతి, సంక్లమము, తాపము, శూల, కండుత్వము విరేచనము, వీర్యహాని, వీనిని గలుగంజేసెడి అష్టవిధదోషంబులుండుటచే నది హరించుటకై చేయదగిన శుద్ధిక్రమమును వచించెద.

## తామ్రశుద్ధి.

శ్లో ॥ తక్రం తైలం ధేనుమూత్రంచ వాంతిం భ్రాంతిం హన్యాత్కాంజికం కౌలధాన్యైః । వజ్రీదుగ్ధం ధేనుదుగ్ధం క్లమం యత్తాపం హన్యాత్తింత్రిణీనింబుతోయమ్ ॥

తా ॥ తామ్రపు రేకులను నిప్పులో కాచి పులిమజ్జిగ, మంచినూనె, గోమూత్రము వీనిలో ప్రతిదానియందు నేడేడుమార్లు ముంచిన నందలి వాంతి దోషంబును, పుల్లనికలి ఉలవకట్టు, వీనిలో ప్రతిదానియందును నేడేడుమార్లు ముంచిన నందలి భ్రాంతి దోషంబును, జెముడుపాలు, ఆవుపాలు, వీనిలో ప్రతిదానియందును నేడేడు మార్లు కాచిముంచిన నందలి క్లమదోషంబులు, చింతపండుపులుసు, నిమ్మపులుసు, వీనిలో ప్రతిదానియందును నేడేడుమార్లు కాచిముంచిన నందలి తాపదోషంబును హరించు.

శ్లో ॥ శూలం హన్యాత్త్రిఫలాక్వాథతోయం హన్యాద్దుగ్ధం గోఘృతం కండుతాంచ । రేచం హన్యాత్సైరణం మస్తుతోయం క్షౌద్రం ద్రాక్షా వీర్యహంతారమాశు ॥

తా ॥ మఱియు తామ్రపు రేకులను కాచి మంచి కలబంద దిరిసెనపుపట్టవీటిరసములలో నేడేడు మార్లు ముంచిన నందలి శూలదోషమును, ఆవుపాలు, ఆవునెయ్యి వీటిలో నేడేడు మార్లు ముంచిన కండూదోషంబును, అడవికంద రసము, పెరుగుమీది నీళ్ళు - వీటిలో ముంచిన విరేచనదోషంబును, తేనె, ద్రాక్షపండురసము వీటిలో ముంచిన వీర్యహాని దోషంబును నశించు.

శ్లో ॥ తప్తానితప్తానిచపత్రకాణి తామ్రస్యసూక్ష్మాణి విశోధయేద్వై । సప్తైవవారాంశ్చపృథక్పృథగ్వై తతః పరంశుద్ధతరాణినూనమ్ । పత్రాణితామ్రస్యసుఖల్వమధ్యే స్నిగ్ధేనసూతేనచనింబుతోయైః । విమర్దయేద్వైద్యపతిశ్చగాఢం గుణాన్వితస్స్యాత్తతరాణియావత్ ॥

తా॥ తామ్రమును పలచగ రేకులుచేసి అగ్నిలోకాచి తొలుత చెప్పినరసములలో ప్రతిదానియందు నేడేడుమార్లు ముంచిన నదిశుద్ధియగు - పిదప దానికిసమముగశుద్ధిజేసినపాదరసమును తామ్రపురేకులను ఖల్వములోవైచి యా తామ్రపు రేకులు తెల్లగసగువరకు నిమ్మపండ్లరసముచే ఖల్వమున జక్కగమర్దింపుచుండవలయును.

శ్లో॥ సుశుద్ధగంధంద్విగుణంసుమందంవిమర్ధయేద్ధాన్యరసేనసార్ధమ్ । ప్రలేపయేత్తానిచపత్రకాణిక్షిపేత్తతోదార్ఢ్యయుతేసుభాండే। నిరుధ్యచాన్యేనశరావకేణప్రపూరయేద్వాలుకయాచభూత్యా । వహ్నిర్విధేయోథశనైశ్శనైశ్చైవయామైశ్చతుర్భిర్భ్రియతేహిశల్బమ్ ॥

తా॥ పైమర్దించియునిచిన రేకులకు ద్విగుణముగ శుద్ధిజేసిన గంధకమును ధాన్యామ్లరసముతో జక్కగమర్దించి తామ్రపు రేకులను లేపనముజేసి యెండించి ప్రమిదలయందునిచి శీలమన్నుచేసి యొకదృఢమైన కుండలోనిసుక, బూడిదెబోసి దాని మధ్యమున శీలజేసినదానినునిచి నాలుగుఝాములు మెల్లమెల్లగ పాకముచేసిన తామ్రము జక్కగ భస్మమగు.

శ్లో॥ పిష్టార్ధగంధేనపునశ్చఖల్వేసంభావ్యచేత్పూరణజద్రవేన । ఏకందినంనిర్జలనోవిదేయశ్చగాపకైరేవగజాద్వయంతే।తతోవిదేయాఃఖలుపంచభావాఃపృథక్పృథక్తేస్వభపంచగవ్యైః। ఈషద్విదేయఃఖలుగంధకోసౌపుటేపుటేనాత్రవిచారణీయమ్ ॥

తా॥ పిదప నాతామ్రభస్మమును దానికర్ధభాగము శుద్ధిజేసిన గంధకమును ఖల్వమునవైచి ఆడవికందరసముచే భావనచేసిప్రమిదెలయందునిచి శీలమన్నుజేసిఒకదినము అగ్నియందునటులగజపుటంబిడవలయు - పిదపనాతామ్రభస్మమును ఆవుపాలు, పెరుగు నెయ్యి, గోమూత్రము, ఆవుపేడరసము, వీనిచే ప్రత్యేకప్రత్యేకములుగభావనచేసె ప్రతి పుటంబునను కొంచము గొంచముగ శుద్ధిజేసిన గంధకము కలిపి పుటంబిడవలయు.

శ్లో॥ క్షౌద్రస్యఖండస్యపుటోవిధేయస్తతఃపరంశుద్ధతరంహిశుల్బమ్ । మయూరకంఠాభమిదంయదాస్యాత్తత్తామ్రికంశుద్ధతమంవదంతి। యత్సేవితంచేద్విదనోతినాంతింగోదుగ్ధకైర్నైవవిశోధయేత్తత్ । కృష్ణామధుభ్యాంపరిసేవయేద్వైగ్రీష్మంశరద్వంచవిహాయమానమ్ ॥

తా॥ పిదప నాతామ్రభస్మమునుతేనె, కలకండ, వీనిలో పుటంబులిడిన నది పరిశుద్ధంబగు. మఱియు మయూరకంఠవర్ణంబుగనుండు తామ్రభస్మము పరిశుద్ధమయినదనిచెప్పంబడు - ఇట్టిభస్మంబును సేవించియు నొకానొకసమయమున అధికముగ వమ

సంబాలయ్యేనేని దానినిమరల ఆవుపాలుతో మర్దించి పుటంబెడివిప్పి [illegible] నుపా
నములతో సేవింపవలయు. తామ్రభస్మమును గ్రీష్మశరదృతువులయందు సేవింపరాదు.

### తామ్రగుణము.

శ్లో ॥ కుష్ఠప్లీహజ్వరకఫమరుచ్ఛ్వాస కాసార్తికోష్ఠాం [illegible]
శూలోదరకృమివమిపాండుమోహాతిసారాన్ । అర్శోగుల్మక్షయభ్రమి
శిరోవ్యాధిమేహాదిహిక్కాః । శుద్ధంశుల్బం హరతి సతతం వహ్నిదీప్తిం
కరోతి ॥

తా ॥ శుద్ధతామ్రభస్మసేవనచే కుష్ఠువు, ప్లీహము, జ్వరము, కఫము, వాతము
శ్వాసకాసలు, వాపు, తంద్ర, శూల, ఉదరము, కృములు, వాంతి, పాండువు, మూర్ఛ
అతిసారము, మూలవ్యాధి, గుల్మము, క్షయము, భ్రమ, శిరోరోగము, ప్రమేహరోగ
ములు, ఎక్కిళ్లు ఇవి, నశించుటయేగాక అగ్నిదీపనము సగాగలుగు.

శ్లో ॥ వహ్నింప్రదీపయతి నాశయతీహకుష్ఠము గ్రంసిపాండు
కఫమేహగదంసశోఫమ్ । అన్యాంశ్చదుస్తరగదానఖిలాంస్తనూస్థాం స్తా
మ్రంప్రయుక్తమచిరాచ్ఛనిహంతిశీఘ్రమ్ ॥

తా ॥ శుద్ధతామ్రభస్మసేవనచే కుష్ఠువు, మూలవ్యాధి, పాండువు కఫము ప్ర
మేహము, వాపు, మొదలగు అసాధ్యరోగంబు లన్నియు అతిశీఘ్రముగ నశించుటయే
గాక అగ్నిదీపనము సగాగలుగు.

### అపక్వదోషము.

శ్లో ॥ పాకేనహీన వమనంకరోతివిరేచనంతాప మతో [illegible]
ర్ఛామ్ । హంత్యాయురప్యశ్చభ్రమమోహపాకేశుక్రాపహంబహీ బ
లాపహారి ॥

తా ॥ హీనపాకముగల తామ్రభస్మము, వమనము, విరేచనము, సంతాపము
అతిమూర్ఛ, భ్రమ, మోహము పాకము, శుక్రక్షయము, దౌర్బల్యము, వీనిసగలుగం
జేయుటయేగాక, ఆయువును సగాక్షయింపంజేయు.

### లోహభేదములు.

శ్లో ॥ కాంతంతీక్ష్ణంవాథముండంత్రయంత్రైసంలోహం బుద్ధి
మంతోవదంతి । దివ్యంమధ్యంచాధమంసంపదంతిగ్రసాగ్య్యం తెస్తాత [illegible]
తలోహంభిషగ్భిః ॥

తా ॥ లోహము కాంత, తీక్ష్ణ, ముండములన త్రివిధంబులని ఆయుర్వేదవేత్తలువచించెదరు-అవి క్రమంబుగనుండుటంజేసి కాంతలోహమే గ్రాహ్యంబని వైద్యవరులు వచించెదరు.

శ్లో ॥ కాంతాభావేతీక్ష్ణలోహంచ గ్రాహ్యంతల్లోహంవైసంస్కృతమ్వ్యంవిధత్తే । ముండంత్యాజ్యంసర్వథానైవగ్రాహ్యం యస్మాన్ముండేభూరిదోషాన్వదంతి ॥

తా ॥ కాంతలోహము దొరకకుండు నెడ తీక్ష్ణలోహమును గ్రహింపందగు అది పాకాభ్యసచే మృదువుగనుండు ముండలోహము మహాదోషకారి యగుటంజేసి సర్వప్రకారములచే నది అగ్రాహ్యంబుగనుండు.

లోహదోషము.

శ్లో ॥ గరళంక్లమవాంతివీర్యహానిఇతిదోషాః ప్రవదంతిలోహకే । అథశోధనభావకాన్పుటాన్ విధినైకేనవదంతసూరయః ॥

తా ॥ లోహమునకు విషము, గ్లాని వాంతి, వీర్యహాని అనుదోషంబులు కలవని ఆయుర్వేదవేత్తలు నక్కాణించెదరు- అవి నివారించుటకైశోధన భావన పుటముల తామ్రమువలెనే జేయందగు.

శ్లో ॥ (అన్యచ్చ) కాంతలోహంచతుర్ధోక్తంరోమకంభ్రాజకం తథా । చుంబకంద్రావకంచేతిగుణస్తస్యోత్తరోత్తరమ్ ॥

తా ॥ కాంతలోహము రోమక, భ్రాజక చుంబక, ద్రావకములననాలుగు విధంబులు- అందు క్రమంబుగ నొకదానికన్ననొకటి గుణాధిక్యంబుగలదిగనుండు.

శ్లో ॥ ముండాదిసర్వలోహానితామ్రవచ్ఛోధయేత్సుధీః త్రయోదశపలాదూర్ధ్వంనహీచేత్షట్పలాదధః ॥

తా ॥ ముండము మొదలగు సర్వలోహములనుతామ్రమువలెనేశుద్ధిచేయవలయు శుద్ధిజేయునెడ లోహమును పదమూడుపలంబులకన్నసధికంబుగను, ఆరుపలంబులకన్నతక్కువగను, నుంచుకొనందగదు.

శ్లో ॥ లోహపాకస్త్రిధాప్రోక్తోమృదుమధ్యఖరస్తథా । పంకశుష్కారసౌపూర్వావాలుకాసదృశఃఖరః ॥

తా ॥ లోహపాకము, మృదు, మధ్య,ఖరంబులన త్రివిధంబులు. అందుకొంచెము తడితో గూడియుండునది మృదుపాకము గలదనియు, శుష్కించియుండునది మధ్యపాకముగలదనియు, యిసుకవలెనుండునది ఖరపాకముగలదనియు, నెరుంగదగు.

శ్లో ॥ లోహపత్రంగంధకే తప్తంవహ్నౌతప్తంపునఃపునః। క్షిపేన్మి నాస్తి జేనీశేయావత్తన్నోష్ణవశీర్యతే ॥

తా ॥ శుద్ధిచేసిన గంధకరసమును ఉదకముతో నూరి లోహపత్రములకు పట్టించి అగ్నిలోతప్తముచేసి పొన్నగంటిరసములో ముంచుచుండవలెయు - ఇటులనా రేకులుపొడియగువరకు జేయుచుండవలయును.

శ్లో ॥ రసహింగుళగంధేనతుల్యంతస్మర్దయేద్దృఢమ్ । నిర్గుండీవృక్షమత్స్యాక్షీరసైర్గజపుటాన్మృతిః ॥

తా ॥ శుద్ధిజేసిన యింగిలీక, రసగంధకములకు సమంబుగ లోహచూర్ణము కలిపి వావిలి, అక్షరసము, పొన్నగంటి, పీసిరసములచే ప్రత్యేకములుగ మర్దించి ప్రత్యేకములుగ పుటంబులిడిన లోహము మృతిజెందు.

శ్లో ॥ లోహచూర్ణంవరాక్వాథే పిండంకృత్వాపునఃపునః । షోడశాంగుళమాత్రేణ నిర్వాతేగర్భపూరయేత్ ॥

తా ॥ లోహచూర్ణమును త్రిఫల కషాయముచే మర్దించిబిళ్ళకట్టి యెండించి చీలమన్నుచేసి గాలిలేనిస్థలంబున పదియారంగుళములలోతుగల నాకపల్లముత్రవ్వి అందుపుటంబిడవలయు.

శ్లో ॥ చతుష్షష్టిపుటైశ్శోపంజాయతే పద్మరాగవత్ । నిరుత్థాంబుతరంయోగవాహీస్యాత్సర్వరోగహృత్ ॥

తా ॥ పైజెప్పిన ప్రకారము లోహమును అరువదినాలుగు పుటంబులిడిననది పద్మరాగమణితో సమానమైన వర్ణము గలదిగను, మరల జనింపకను, అమృతతుల్యముగను, సర్వకార్యములయందుపయోగింప దగినదిగను, సమస్తరోగముల నశింపజేయునదిగను, నుండును.

లోహజనగత్వమంత్రము.

ఓం ॥ అమృతోద్భవాయఫట్ ॥

తా ॥ అనుమంత్రమును పఠింపుచు పుటంబిడవలయు.

లోహమర్దనమంత్రము.

ఓం ॥ అమృతోద్భవాయస్వాహా ॥

తా ॥ అనుమంత్రమును పఠింపుచు లోహమునుమర్దించవలయు.

బలిదానమంత్రము.

ఓం ॥ సమశ్చండవజ్రాయనమోమహాయక్షసేనాధిపతియేకురుకురుమహావిద్యావిలాయస్వాహా ॥

*

తా ॥ ఆనుమంత్రమును పఠింపుచు బలియొసంగవలయు.

భక్షణమంత్రము.

ఓం ॥ అమృతంభక్షయిష్యామిస్వాహా ॥

తా ॥ ఆనుమంత్రమును పఠింపుచు భక్షింపవలయు.

లోహసేవనయందు వర్జింపదగినపదార్థములు.

శ్లో ॥ కూశ్మాండంతిలతైలంచమాషాన్నంరాజికాంతథా। మద్యమమ్లరసంశాకంలోహసేవీనభక్షయేత్ । నాస్నీయాత్కదలీ కందంకాంజికంకరమర్దకమ్ । కరీరంకారవేల్లంచషట్కాకారాణివర్జయేత్ ॥

తా ॥ లోహభస్మమును సేవించునెడ గుమ్మడికాయ, నూనె, మినపఅన్నము ఆవాలు - మద్యము, పులుసు ఆకుకూరలు, అరటికాయ, కంద, తీపికంద, పుల్లనికల్లి, కరమర్దకము, కరీరము, కాకరకాయ, వీనిని భక్షింపదగదు.

లోహగుణము.

శ్లో ॥ లోహంమృతంకజ్జలసన్నిభంతుభుంక్తేసదాయోరసరాజయుక్తమ్ । తస్యైవదేహేనభవంతిరోగామృతోపికామఃపునరేతిధామ॥

తా ॥ కజ్జలి సదృశమగు లోహభస్మమును శుద్ధిజేసిన పాదరసముతో జేర్చి సేవించిన యేరోగంబును శరీరమున అంటకనుండుటయేగాక కామహీనులకు మిగుల కామవృద్ధిని సగాగలుగంజేయు.

శ్లో ॥ లోహోజంతువికారపాండుపవనక్షీణత్వపిత్తామయస్థౌల్యార్శోగ్రహణీజ్వరార్తికఫజిచ్ఛోఫప్రమేహప్రణుత్ । గుల్మప్లీహవిషాపహంబలకరంకాంతాజనానందకం సౌఖ్యాలంబిరసాయనంమృతిహరం దృష్టేశ్చకాంతిప్రదమ్। ఆమవాతగదేషుశోఫనంపాండుమేహగదనాశనే గజః । దుష్టకుష్ఠపలితాస్రవాతజిత్స్యాజ్జరామృతివలీవినాశనః ॥

తా ॥ లోహభస్మముజంతువికారము, సర్పదంష్ట్రవిషము, పాండువు, వాతక్షీణత్వము, పిత్తరోగము, శరీరస్థౌల్యము, మూలవ్యాధి, గ్రహణి, జ్వరము కఫము, శోఫ, ప్రమేహము, గుల్మము, ప్లీహము, విషము, ముదిమి, నేత్రరోగము, ఆమవాతము, మహాకుష్ఠువులు, శ్వేతకుష్ఠువులు, గక్తవికారము, మృత్యువు, వలీపలితములు మొదలగురోగంబుల హరింపజేసి కడుబలంబును, అనేకస్త్రీలతో రమించుటకు తగిన శక్తిని గలుగంజేయు.

శ్లో ॥ సశోఫపాండుక్షయకామలామయప్రమేహపాపీరహలీమ

ద్రవ్యైరుద్ధరే । తతఃక్షాలయిత్వాకదంబస్య నిశేషు ఛేషాల యేత్తప్తకం సప్తవారాన్ ॥

తా ॥ వంగమును మూత్రవర్గము, ఆమ్లవర్గము, పలుద్రవ్యములుకూడినక్షారజలము, బొంతజెముడుపాలు, జిల్లేడుపాలు, కదంబవృక్షరసము, వీనిలో ప్రతిదానియందును నేడేడుమార్లు కరిగించిపోసిన నది శుద్ధియగు.

వంగమారణము.

శ్లో॥ త్రపుశుద్ధంమద్ధృతంసుపారదేనసుభద్దగ్దేవరవేర్దశాంశకేన। దృఢదండేనచదాడిమోద్భవేనఘృష్టితంమృత్యుఘ్నముపైతిఖర్పరేగ్నౌ ॥

తా ॥ శుద్ధిజేసినవంగమునకు దశమాంశముగ శుద్ధిజేసిన పాదరసమును జిల్లేడుపాలునునొకమూకుడులోవైచికరిగించిదాడిమకొయ్యచేనొకఝామువరకుబలముగ మర్దింపుచుండిన వంగము భస్మమగు.

శ్లో ॥ సకలమేహసమీరణనాశకృచ్ఛ్రమకఫక్షయ పాండువినాశనః । శ్వసనశూలయకృద్వమనార్తిహృత్ప్రదరమేవనిహంతిసువంగకః॥

తా ॥ సువంగభస్మము సకలమేహములను భ్రమ, కఫము, క్షయరోగము, పాండువు, శ్వాస, శూల, యకృత్తు, వమనము, ప్రదరరోగము వీటిని హరింపంజేయు.

శ్లో ॥ ఆయుఃప్రదాతాబలవీర్యకర్తారోగాపహం శ్రీమదనస్యకర్తా।వంగేనతుల్యంనచకించిదన్యద్రసాయనంశ్రేష్ఠతరంనరాణామ్॥ బల్యంపాచనదీపనంరుచికరంప్రజ్ఞాకరంశీతలమ్।సౌందర్యైకవివర్ధనంప్రాతతరం నీరోగవాకారణమ్ । ధాతుస్థైర్యకరంక్షయక్షయకరం సర్వప్రమేహాపహమ్ । వంగంభక్షయతోనరస్యనభవేత్స్వప్నేపిశుక్రక్షయః ॥

తా ॥ వంగభస్మము ఆయుర్వృద్ధి, బలము, వీర్యము, రోగనాశము, కామము వీనిని గలుగంజేయు. అందనంజేసి వంగభస్మమునకు సమానంబైన అన్యరసాయనము మరియొద్దియును లేకయుండు. మఱియు, నావంగభస్మము, బలము, అగ్నిదీపనము పాచనము, రుచి, బుద్ధి, శీతలము, సౌందర్యవృద్ధి, వేగము సర్వరోగనాశనము, ధాతుస్థైర్యము, క్షయరోగనాశనము, సర్వప్రమేహనాశనము వీనిని గలుగంజేయుట యేగాక దీనిని సేవించినవారికి స్వప్నంబున నగా శుక్రక్షయము గలుగకయుండు.

పాకదోషము.

శ్లో ॥ పాకేనహీనఃఖలువంగకోసౌకష్టానిగుల్మాని మహాత్రిరోగాన్।పాండుప్రమేహాపచివాతశోణితంబలాపహారంకురుతేనరాణామ్॥

తా ॥ అపక్వ వంగభస్మము కుష్ఠువు, గుల్మము మొదలగు మహారోగంబులు, పాండువు, ప్రమేహము, అపచి వాతము, రక్తవికారము కామ క్షయము, వీనినిజయిం పంజేయు.

వంగేశ్వరవిధి.

శ్లో ॥ చతుర్విభాగామృతవంగకస్యాప్యేకోవిభాగోమృతపారదస్య। భాగద్వయంవైమృతతాళకస్యహ్యేకోవిభాగోమృతశంఖకస్య। సర్వస్యచూర్ణంసహకాంజికేనవిమర్దయేత్సంపరిపాచయేద్వై। శరావకైర్వాసరతస్సువహ్నౌవంగేశ్వరస్స్యాద్గజపుటాహ్వయంత్రే॥

తా ॥ వంగభస్మము (౪) భాగములు - రసభస్మము ౧ భాగము . తాళకభస్మము (౨) భాగములు-శంఖభస్మము (౧) భాగము-ఇటులవీటిని ఖల్వమునవైచిపుల్లనికలితో జక్కగమర్దించి బిళ్లచేసియెండించి శరావములయందునిచి స్వల్పాగ్నిచే నొకదినము గజపుటంబునపక్వముచేసిన నది పరిశుద్ధమయిన వంగేశ్వర రసంబగు.

వంగేశ్వరగుణము.

శ్లో ॥ భ్రమతమకకఫేనాశ్వాసకాసక్షయేవావిషరుధిరకకీలేవాతపిత్తప్రమేహే। జ్వరగ్రహణిసశూలేకుష్ఠపాండ్వల్పవీర్యే బహుగదవతిశస్తోరమ్యవంగేశ్వరోసౌ ॥

తా ॥ శుద్ధవంగేశ్వర రసము భ్రమ, తమకము, కఫము, శ్వాసకాసలు, క్షయరోగము, విషవికారము రక్తవికారజనితపీడ, వాతము, పిత్తము, ప్రమేహము, జ్వరము, సంగ్రహణి, శూల, కుష్ఠువు, పాండువు, క్షీణత్వము, మొదలగుబహురోగముల నశింపజేయుటయందు హితకారిగనుండు.

నాగాశ్రితదోషములు.

శ్లో ॥ భుజంగమేద్వౌకథితౌచదోషావాంతిశ్చతాపోథవిచార్యబుద్ధ్యా। తచ్ఛోధనంసంపరికీర్తయిష్యేయచ్ఛోధనేదోషవివర్జితంస్యాత్ ॥

తా ॥ నాగము వాంతి, తాపదోషద్వయముల నాశ్రయించి యుండునని పెద్దలువచించెదరు. అవినివర్తించుటకైతగిన శుద్ధులవచించెద.

నాగశుద్ధి.

శ్లో ॥ ఫలత్రికకషాయేవాకుమారీరసేవాకరివరసలిలేవాగాలయేత్సప్తవారాన్। ఖదిరదహనతప్తంలోహపాత్రే స్థితంస్యాత్తదనుసపదినాగోజాయతేశుద్ధభావమ్ ॥

తా ॥ నాగమును త్రిఫలకషాయము, ఘృతము, కలబందరసము, కరివరరసము వీనిలో ప్రతిదానియందును నేడేడుమార్లు భావనచేసిన నది శుద్ధియగు - పిదప దానిని శౌకయినుపబాణలిలోవైచి అగ్నిలోనునిచి చంద్రకోయ్యచే మర్దింపుచుండిన నాగము శుద్ధియగు.

నాగమారణము.

శ్లో ॥ భుజగఏనహిశుద్ధమథఖర్వ లేద్విగుణశుద్ధమనశ్శిలయాసహ। సుదృఢకింశుకకాష్ఠసుదర్విణా సపదిమృత్యుముపైతసుఘర్షితమ్ ॥ ఈష చ్ఛిలానాగలతారసేనసార్ధంవిమర్ద్యైవపునఃపునశ్చ । ఏవంహిద్వాత్రింశ

త్పుటైశ్చ గావేనిరుచ్ఛతాంయాతిభుజంగమోపి ॥

తా ॥ శుద్ధిచేసిన మణిశిల (౨) భాగములు-శుద్ధిచేసిన సీసము (౧) భాగము-ఇటులవీటిని మంటిమూకుటిలోవైచి దృఢమయిన మోదుగ కాష్ఠముచేసేని గరిటచేనే నిమర్దింపుచుండిన నాగము భస్మంబగు పిదపనాభస్మమునగొంచముగమణిశిలనువైచితమలపాకుల రసముచేమర్దించి బిళ్లచేసి యెండించి ప్రమిదెలయందునిచి చీలమన్ను చేసి పుటంబిడవలయు ఇటుల (౩౨) పుటంబులిడిన సీసమునిర్దోషముగ సింధూరమగు.

నాగగుణము.

శ్లో ॥ క్షయపవనవికారేగుల్మపాండ్వామయేషుభ్రమక్రిమి కఫ శూలేమేహకాసామయేషు । గ్రహణిగుదగదేవైనష్టవహ్నౌప్రశస్తస్సు భవిధికృతనాగఃకామకార్యందదాతి ॥

తా ॥ నాగభస్మము క్షయరోగము, వాతవికారము, గుల్మము, పాండువు భ్రమ క్రిమిరోగము,కఫము,శూల, ప్రమేహము, కాస, గ్రహణి,భగందరము, అగ్ని మాంద్యము మొదలగురోగములనశింపజేయుటయేగాకవీర్యవృద్ధినిసుగాగలుగంజేయు.

శ్లో ॥ నాగోహినాగశతతుల్యబలందదాతివ్యాధీంశ్చనాశయతి జీవితమాతనోతి । వాయుంకృమీనపినిహంతిసతిక్తమేవం వృష్యంచపిత్త కరమాశుమృతిందిహంతి ॥

తా ॥ నాగభస్మము నూరుయేనుగులబలమును గలుగంజేయునదిగను,సర్వరోగముల పోగొట్టునదిగను, ఆయుర్వృద్ధికారిగను, వాత కృమిమొదలగురోగములబోకడుచునదిగను, తిక్తరసముగలదిగను, శీతకారిగను, వీర్యవృద్ధికరముగను,పిత్తకరముగను అకాలమృత్యువును పోకడుచునదిగనునుండు.

అపక్వదోషము.

శ్లో॥ కుష్ఠానిగుల్మారుచిపాండురోగాః క్షయంకఫంరక్తవికార

కృచ్ఛ్రమ్ । జ్వరాశ్మరీశూలభగందరాద్యంనాగంహ్యపక్వం కురుతేన రాణామ్ ॥

తా॥ అపక్వనాగభస్మము కుష్ఠువు గుల్మము అరుచి పాండురోగము, క్షయ రోగము, కఫము, రక్తవికారము, మూత్రకృచ్ఛ్రము, జ్వరము, అశ్మరి, శూల భగందరము,వీటిని గలుగంజేయు.

## నాగేశ్వరవిధి.

శ్లో॥ మృతభుజంగమచూర్ణ పలద్వయందరదశుద్ధరసాయపలద్వయమ్ । పలచతుర్థవిభాగమనశ్శిలాస్సకలచూర్ణసమోమలగంధకః । తదనునింబరసేనవిమర్ద్య వేద్గజపుటేపుటితోదృఢసంపుటే ॥ వనశిలాభిరయు తేదినమేకతో భుజగభోమమనాగపతిర్భవేత్ ॥

తా॥ సీసభస్మము (౨) పలములు శుద్ధిచేసిన యింగిలీకచూర్ణము (౨) పల ములు-మణిశిల(౧)పలము ఇటులవీటినిసేకముజేసి దీనికి సమముగశుద్ధిచేసిన గంధకము నుకలిపిచక్కగనిమ్మపండ్లరసముచే మర్దించి బిళ్లచేసి యెండించిప్రమిదెల యందునిచి చీలమన్నుబూసియెరుపిడకలచే నొకదినముగజపుటంబిడినన ది నాగేశ్వరరసమనంబడును.

## నాగేశ్వరగుణము.

శ్లో॥ యోనాగరాజంజనీవిరామే తాంబూలపత్రైస్సహసేవ యేద్వై వల్లద్వయంపిప్పలికాయుతంనై స్త్రీణాంసహస్రేణనతృప్తిమేతి॥

తా॥ పైచెప్పిననాగేశ్వరరసమును రెండువల్లముల ప్రమాణము (అరుగురిగింజలయెత్తు) తమలపాకులలోనునిచి అంచుకొంచముగ పిప్పలి చూర్ణముకలిపి ఉదయకాలంబున సేవించిన సహస్రస్త్రీలతోరతికేళిం దేలినను తృప్తికలుగకయుండును.

శ్లో॥ అతిమేహసుభుజంసకామలంనాగుణరాగేచ సమీరణభ్రమే వా । శ్వసనక్షయపాండుమంద వహ్నీన్ భుజగేంద్ర స్సతతం నిహంతి శీఘ్రమ్ ॥

తా॥ మఱియును నాగేశ్వరరసము ప్రమేహము, కామిల, గుణరాగము వాతజనితభ్రమ, ఉన్మాదము, శ్వాస, క్షయము, పాండువు, అగ్నిమాంద్యము మొదలగు రోగముల శీఘ్రముగ నశింపంజేయు.

## అరశోధనము.

శ్లో॥ అద్వితీయేభుజంగాశేకధితేత్రిఫలాంపరైః । శోధనంకీర్త యిష్యేహంరస్యవిధిపూర్వకమ్ ॥

తా ॥ ఇత్తడినిపై ద్యశ్రేష్ఠులగువారు యథావిధిగ శుద్ధిచేయతగిన విధానమును వివరించెద.

శ్లో ॥ క్షాలత్తాంభేతకర్త్రైలే తక్రైకమూత్రేపశ్చాత్కాంజికేసం క్షేపేత్ । తస్తాన్యపస్మాన్యారపత్రాణివశుద్ధాన్యేవంసంభవేయు స్తదానీమ్ ॥

తా ॥ ఇత్తడి రేకులను అగ్నిలోపలుమారు తప్తముచేసి ఉలవకట్టు, మజ్జిగ, తైలము, గోమూత్రము, కలి, వీనిలో ప్రతిదానియందును యేడేడుమార్లుముంచినసది శుద్ధియగు.

ఇత్తడిమారణము.

శ్లో ॥ ఆరస్యపత్రాణివిలేపయేద్ద్వ్యసూర్యస్యదుగ్ధేనచగంధకేన । సమంగజాహ్వాసుద్ధృతేగా వేచ్చటద్వయేనాపిభవేత్సుభస్మ ॥

తా ॥ శుద్ధిచేసిన ఇత్తడి రేకులకు సమముగ శుద్ధిచేసిన గంధకమునుగ్రహించి జిల్లేడుపాలతో నూరి యారేకులకు లేపనముచేసి యెండనెండించిప్రమిదెలయందునిచి రెండుగజపుటంబులిడిన ఇత్తడి భస్మంబగు.

ఇత్తడిభస్మగుణము.

శ్లో ॥ సకలవాయురుజంగుదజాంరుజంగ్రహణికాం కఫపాండు భవాంరుజమ్ । శ్వసనకామలశూలభవాంరుజంహరతి భస్మతదారక సంభవమ్ ॥

తా ॥ ఇత్తడిభస్మము సమస్తవాతజనిత రోగంబులు, గుదరోగము,సంగ్రహణి కఫము, పాండువు, శ్వాస, కామిల, శూల వీటిని నశింపంజేయు.

అపక్వదోషము.

శ్లో ॥ వివిధరోగచయంకురుతేభ్రమింగుదరుజం హ్యాతిమేహరు జాంగణమ్ । వివిధతాపక మాతనుతేతనావిమృతమారకమాశుహిమృత్యుదమ్ ॥

తా ॥ అశుద్ధమగు ఇత్తడి భస్మముపలువిధరోగసంచయము,భ్రమ,గుదరోగము ప్రమేహము, పలువిధజ్వరములు, మృత్యువు, వీటినిగలుగంజేయు.

సప్తధాతుపరీక్షాక్రమము.

శ్లో ॥ స్వర్ణంకపోతకంతాభమారమేవంసదాభవేత్ । శుల్బం

మయూరకంఠాభంతారవంగౌసముజ్జ్వలౌ। కృష్ణసర్పనిభం నాగంతీక్ష్ణకం కజ్జలప్రభమ్ । తదాశుద్ధింవిజానీయాత్సర్వంతిభ్రాంతివివర్జితమ్ ॥

తా ॥ సువర్ణము ఇత్తడి, వీని భస్మంబులు పావురపిట్టకంఠముతో తుల్యమగు వర్ణముగలవిగను, తామ్రము నెమలి కంఠముతో తుల్యమగు వర్ణముగలదిగను, రౌప్య వంగభస్మంబులు స్వచ్ఛమయిన కాంతిగలవిగను, నాగము కృష్ణసర్పవర్ణతుల్యముగను లోహభస్మము కజ్జలితోతుల్యముగను, నుండవలయు నుత్తియు నీసప్తధాతు భస్మంబులు వాంతి భ్రాంతి దోషరహితంబులుగ నుండెనేని యవిక్రమంబుగ శుద్ధిచేయబడినవని నెఱుంగందగు.

శ్లో ॥ ఏతత్సర్వంయదానస్యాత్పుటానస్యాన్సమాచరేత్ । సేవనస్యప్రమాణంచకథయిష్యేహితేషిణః ॥

తా ॥ సువర్ణాదిభస్మములకు పైచెప్పినకపోతకంఠాది వర్ణంబులు గలుగువఱకు పుటంబులు వేయుచుండవలయు - ఆసప్తధాతు భస్మసేవన ప్రమాణంబుల ఉత్తరత్ర వచించెద.

ఔషధములచేయుటకు ప్రశస్తస్థానంబులు.

శ్లో ॥ ఊర్ధ్వమాచ్ఛాదితేదేశేవస్త్రాదిప్రావృతేతథా। గృహేవానిర్జనేపూతేభేషజంకారయేద్బుధః ॥

తా ॥ ఊర్ధ్వభాగమున నాలుగుపార్శ్వములయందు వస్త్రాదులచే కప్పబడియుండెడిప్రదేశంబుననేని పవిత్రగృహంబుననేని, జనసమూహములేని గృహంబుననేని ఔషధముల చేయవలయు.

శ్లో ॥ ఊర్ధ్వముఖైశ్శిలాఖల్వైశ్శిలాయాం మర్దయేత్సదా । తదాహిద్విగుణంవీర్యంస్యాదీశానముఖోయది ॥

తా ॥ ఔషధము నూరేశిలను ఊర్ధ్వముఖంబుగ పట్టుకొని యీశానముఖంబుగ కూర్చుండి ఔషధమును ఖల్వమున మర్దించిన దానికి ద్విగుణవీర్యముగలుగు.

శ్లో ॥ తిత్త్రిడీఖదిరాదీనాందృఢేవిమలేతథా । ఉలూఖలేఖేదయిత్వాగ్రాహ్యంభేషజముత్తమమ్ ॥

తా ॥ చింత, చండ్రమొదలగు వానిచే దృఢమయి నిర్మలమగురోలునుఉత్తమ ఔషధముల దంచునిమిత్తము వైద్యుడునిర్మింపవలయు.

ఔషధములస్పృశించుటకనర్హులు.

శ్లో ॥ రజస్వలానపత్న్యావాపాషండీయదివాస్పృశేత్ । ఆమయావాపిభైషజ్యంనిర్వీర్యంజాయతేతదా ॥

తా ॥ రజస్వలలు వంధ్యాస్త్రీలు, పాషండులు, రోగులు, వీరలు ఔషధమునుస్పృశింపకూడదు స్పృశించిన ఔషధము నిర్వీర్యంబగు.

ఔషధముల చేయతగనిస్థలములు.

శ్లో ॥ నకార్యమౌషధంశూన్యేనౌకాయాంహట్టమండలే । పథితరుతలేవాపిశూన్యేశూన్యఫలంభవేత్ ।

తా ॥ శూన్యస్థలము, ఓడ, బాజారు, మార్గము, వృక్షమునకు క్రిందిప్రదేశము వీనియందుఔషధములుజేసిన నవి నిర్వీర్యంబులగు.

ఔషధపాత్ర.

శ్లో ॥ ఔషధంహేమరజతమృద్భాజన పరిస్థితమ్। పిబేత్సంచింత్యవిష్ణుంచపీత్వాపాత్రమధోముఖమ్।నిక్షిప్యతస్యసలిలంతాంబూలాద్యుపకల్పయేత్ । మాత్రయాహీనయాద్రవ్యోవికారంననివర్తయేత్ ॥

తా ॥ సువర్ణము, రజతము, మృత్తిక, వీనిలో దేనిచేనైన జేయంబడినపాత్రయందు ఔషధమునునిడివిష్ణుధ్యానము జేసి, పానంబొనర్చియాపాత్రయందు శిష్టమగు కషాయాదులు భూమియందు పడునట్లునాపాత్రను అధోముఖంబుగ నుంచవలయు-పిదప తాంబూలాదుల భక్షింపనలయు-ఔషధమును హీనప్రమాణముగ సేవించినసది రోగమును నివర్తింపజేయకుండు.

శ్లో ॥ ద్రవ్యాణామతిబాహుల్యాద్వ్యాపత్సంజాయతేభృశమ్। మాత్రాయామాశువపుషంస్థానమగ్నింబలంవయః । వ్యాధింద్రవ్యంచకాలంచవీక్ష్యమాత్రాంప్రకల్పయేత్ ॥

తా ॥ ఔషధద్రవ్యబాహుళ్యముచే రోగికి వికారముగలుగు - అందునంజేసి శరీరము, స్థానము అగ్ని, శక్తి,వయస్సు, వ్యాధి,ద్రవ్యము,కాలము మొదలగువానిని వయిద్యుడెరింగి ప్రమాణానుగుణ్యముగ నౌషధమును బ్రయోగింపవలయు.

శ్లో ॥ ఉత్తమస్స్యాత్ఫలంమాత్రాత్రిభిశ్చాక్షైశ్చమధ్యమే । జఘన్యస్యపలార్ధేనస్నేహక్వాథౌషధేషుచ । సార్ధపలంపలంచార్ధంవిదధ్యాద్గుడఖండయోః ॥

తా ॥ స్నేహము, కషాయము, ఇట్టి యౌషధములయందుత్తమయౌషధము నుపలప్రమాణంబును, మధ్యమ యౌషధమును మూడుతులప్రమాణంబును, నిషిద్ధౌషధమును అర్ధపలప్రమాణంబును, ఒసంగవలయు- గుడమునందునౌషధమునుపయోగించునెడల ఒకటిన్నరపలప్రమాణంబును, కలకండయందు ఒసంగునెడల అర్ధపలప్రమాణంబును, నివ్వవలయు.

శ్లో ॥ శ్రేష్ఠమధ్యమహీనేషుమాత్రేయం మునిభిః కృతా । అత్ర స్యాత్ సాంశుతంపంచరక్తిమాసాధకంపలమ్ । మోదకంవటకంలేహం కర్షమాత్రంప్రయోజయేత్ । కర్షద్వయంపలంవాపి దేయం కోష్ఠాద్యపేక్షయా ॥

తా ॥ మునులుశ్రేష్ఠ, మధ్యమ, హీనఅవుషధములయందు ప్రమాణంబులుత్రివిధంబులని వచించెదరు. అంగుసుశ్రుతములో మోదకము, వటకము, లేహము, వీనివిషయమయిజెప్పంబడియుండెడు పంచరక్తిమాత్రాప్రమాణము శ్రేష్ఠంబు, మధ్యమమాత్రాప్రమాణము ఒకపలము - హీనప్రమాణము ఒకకర్షము - కోష్ఠాదిరోగంబులందు రెండుకర్షంబులులేని, లేకఒకపలప్రమాణంబేని, యొసంగవలయు.

శ్లో ॥ శ్రేష్ఠమధ్యమహీనేషుద్వాదశాష్టచతుష్టయైః । మాషైర్గుగ్గులమాత్రేయంకోష్ఠంవీక్ష్యవిభావయేత్ ॥

తా ॥ శ్రేష్టమధ్యమ హీనప్రమాణంబుల కోష్టాదిరోగబలంబు నెఱింగి ౧౨, ౮, ౪ మాషములప్రమాణముగ సమస్తగుగ్గులసంబంధమగు ఔషధముల కల్పనజేయవలయు.

శ్లో ॥ గుంజామాత్రరసందేవి హేమభస్మంచ దాపయేత్ । తారంద్విగుంజకంప్రోక్తంరవిజీర్ణంత్రిగుంజకమ్ ॥

తా ॥ సువర్ణభస్మము, పాదరసము వీనిని గుంజాప్రమాణంబును, రజితభస్మమును ద్విగుంజాప్రమాణంబును, తామ్రభస్మమును త్రిగుంజాప్రమాణంబును,ఒసంగవలయు.

శ్లో ॥ తీక్ష్ణాభ్రనాగవంగానాంకర్పూరస్యశిలాజతోః । షడ్గుంజాప్రమితామాత్రానానోపరసమాషకమ్ ॥

తా ॥ లోహము, అభ్రకము, సీసము, కర్పూరము, శిలాజిత్తు, వీనినిఆరుగురిగింజలప్రమాణము సేవింపవలయు - మఱియు పలువిధములగు ఉపధాతుభస్మంబులు మాషప్రమాణము సేవింపందగు.

శ్లో ॥ యవమాత్రంవిషందేవిగుంజామాత్రంచకుష్ఠినే। వజ్రంయవద్వయమితంతారకంయవసప్తకమ్ ॥

తా ॥ విషమును యవప్రమాణంబును, కుష్ఠరోగికి గుంజామాత్రంబును వజ్రభస్మమును (౨) యవలప్రమాణంబును, రజతభస్మమును (౭) యవలప్రమాణంబును, నివ్వవలయునని ఈశ్వరుడు పార్వతికివచించె.

శ్లో ॥ తతోబుద్ధ్వాభిషక్దద్యాన్మాత్రాంమాత్రేతికీర్తితా । కర్షాదౌషుపలంయావద్దద్యాత్షోడశికంజలమ్ । తతస్తుకుడవం యావత్తోయమష్టగుణంభవేత్ ।చతుర్గుణోమతశ్చోర్ధ్వంయావత్ప్రస్థాదికంభవేత్॥

తా ॥ ఇటులసామాన్యముగమాత్రాప్రమాణమువచింపబడియె. కావున వైద్యుడు దేశకాలాదులను బుద్ధిచేనాలోచించి ఔషధమ్యానాధిక్యప్రమాణంబునెఱింగిప్రయోగించవలయు కర్షప్రమాణము మొదలు పలపర్యంతము చెప్పబడియుండెడు శ్లోకమాన సంఖ్యప్రకారము గ్రహింపబడియుండు స్థలంబున కర్షాది ప్రమాణము మొదలుపదియారింతలయుదకమునుఒసంగవలయు - పలప్రమాణము మొదలుకుడవపర్యంతము చెప్పంబడియుండుశ్లోకమానసంఖ్యాప్రకారము గ్రహింపబడియుండుస్థలంబున నెనిమిదింతల యుదకమునుఒసంగవలయు - కుడవము మొదలు ప్రస్థమువరకు గ్రహింపబడియుండు స్థలంబుననాలుగింతల యుదకమును ఒసంగవలయు.

శ్లో ॥ కాలదోషవయోపిక్ష్యనరాణాంమందవీర్యతామ్ । అనిర్దిష్టప్రమాణానాంప్రమాణమిదమీరితమ్ ॥

తా ॥ కాలము, దోషము, వయస్సు శక్తి, అల్పవీర్యము, మొదలగువానినెఱింగి వైద్యుడు మాత్రాప్రమాణములగల్పింపవలయు. ఏయౌషధమునందు ప్రమాణము చెప్పబడకుండెనేని ఆస్థలంబున యీప్రమాణంబులనే సామాన్యముగ గ్రహింపవలయు.

సప్తధాతు సేవనమాత్రా ప్రమాణము.

శ్లో ॥ వల్లార్ధంకనకంచకాంచనమితంరూప్యంచశుల్బంతథా ।తీక్ష్ణంవంగభుజంగరనిచసౌవల్లార్ధవలోన్మితః । తత్తుల్యాశుభపిప్పలీనిగదితాక్షౌద్రంచకర్షోన్మితమ్ । సేవ్యంసంపరిహృత్యగ్రీష్మశరదౌతామ్రంసుసేవ్యంనరైః ॥

తా ॥ సువర్ణ, రౌప్య, తామ్ర, భస్మంబుల ఒకటిన్నరగురిగింజ ప్రమాణంబును లోహ, వంగ, సీస, ఇత్తడి, భస్మంబుల తొమ్మిదిగురిగింజల ప్రమాణంబును, సేవిం

పవలయు. సువర్ణాది భస్మంబుల సేవించునెడవారికి సమంబుగ శుద్ధిచేసిన పిప్పలిచూ ర్ణంబును, రెండుతులములతేనెను కలిపి సేవింపవలయు – తామ్రభస్మమును గ్రీష్మ, శరదృతువులయందుతప్ప యితరఅన్ని ఋతువులయందును సేవింపందగు.

ఇత్యనుపానమంజర్యాం సప్తధాతూనాంశోధనమా
రణంనామ పంచమస్సముద్దేశః.

---

శ్లో॥ తాళేనవంగందరదేనతీక్ష్ణంనాగేనహేమం శిలయాచనాగమ్ । శుల్బంతథాగంధవరేణనిత్యం తారంచమాక్షీకవరేణహన్యాత్ ॥

తా॥ తాళకముచే వంగమును, ఇంగిలీకముచే లోహంబును, సీసముచే సువర్ణంబును, మణిశిలచే సీసంబును, శుద్ధగంధకముచే తామ్రంబును, మాక్షికముచే రౌప్యంబును, మృతిజెందు.

## ఉపధాతువులసంఖ్య.

శ్లో॥ నీలాంజనంమాక్షికతుత్థ కాలంశిలాభ్రికోవారసకంచ సప్త। వదంతినిత్యంకిలచోపధాతూన్తచ్ఛోధనంసంపరికీర్తయిష్యే ॥

తా॥ * నీలాంజనము, మాక్షికము, మైలుతుత్తము, తాళకము, మణిశిల, అభ్రకము, రసకము, అనువానిని సప్తోపధాతువులని మునులువచించెదరు. కావున వానిశోధనమారణంబుల వచించెద.

## నీలాంజనశుద్ధి.

శ్లో॥ నీలాంజనంగాఢతరంవిచూర్ణంజంబీరతోయేనవిభావయేత్తత్ । తీవ్రాతపేప్యేకదినంసుశుద్ధంభవేత్సుకార్యేష్వథయోజనీయమ్ ॥

తా॥ నీలాంజనమును కడుసూక్ష్మముగ చూర్ణముచేసి దానిని నిమ్మపండ్లరసముతో భావనచేసి మంచియెండలో నొకదినము నెండించిన నది శుద్ధయగు అట్టినీలాంజనమును సర్వకార్యములయందుపయోగింపనగు.

## హేమమాక్షికశుద్ధి.

శ్లో॥ త్రయోపిభాగాశ్శుభమాక్షికస్యాప్యేకోపిభాగశ్శుభసైంధవస్య । తన్మాతులుంగస్యరసస్యభావోజంబ్వామ్రజంబీర రసస్యభావః ।

---

* సురమతాయి.

సుఖర్పరేలోహజదర్విణాగ్నౌ సంచాలయేద్వైద్యపతిశ్చమందమ్ । తత్ఖర్పరేరక్తిక తాయదాస్యాత్తదాసుశుద్ధాఖలుహేమమాక్షీ ॥

తా॥ స్వచ్ఛమగు సువర్ణమాక్షీకము (౩) భాగములు-సైంధవలవణము (౧) భాగము-ఇటుల వీటిని గ్రహించి మాదీఫలరసమున మర్దించి భావనచేసి పిదపదానిని నేరేడుపండ్లరసము, మామిడిరసము, నిమ్మపండ్లరసము, వీనిచేభావనచేసి దృఢమయినమూకుడులోవైచి అగ్నియందిడి యినుపగరిటతో మెల్లమెల్లగ వేయింపుచుండిన మూకుడెపుడు నెఱ్ఱగనయ్యెడినో యపుడది నిశ్చయముగ శుద్ధియయినదని తెలియందగు.

సువర్ణమాక్షీకమారణము.

శ్లో॥ హేమమాక్షీకవిచూర్ణకంన్యసేత్ఖర్పరేబహుళనింబజైర్ద్రవైః। చాలయేత్తదనులోహదర్విణాఖర్పరేతచ్ఛయామకద్వయమ్ ।సమ్యగాయదిసురక్తతాభవేత్పిప్పలీమధుయుతాత్రివల్లకా । సేవతాంబహుళపాండుకామలావాతపిత్తకహలీమకంజయేత్ ॥

తా॥ శుద్ధిచేసిన సువర్ణమాక్షీకములో తెల్లమిరియాల రసమును,నిమ్మపండ్లరసమును, అనేకమునగ్నైచు మర్దించి యెండనెండించి యొకమూకుడులోవైచి అగ్నియందిడి యినుపగరిటలో రెండుయామములు మర్దింపుచుండిన నదిసుందరమగు రక్తవర్ణముగలదియైభస్మమగును. అభస్మములో మూడు గురిగింజల యెత్తును గ్రహించి యందు సమముగ పిప్పలిచూర్ణము, తేనెకలిపి సేవించిన ప్రబలమయిన పాండువు, కామిల వాత పిత్తహలీమకములు, ఇవి నశించు.

సువర్ణమాక్షీకగుణము.

శ్లో॥ వివిధపాండుగదాఞ్భ్రమకంక్షయంశ్వాసనకంచజయేన్మృతమాక్షీకమ్ ॥

తా॥ సువర్ణమాక్షీకభస్మము పలువిధపాండురోగములు, భ్రమ,క్షయరోగము శ్వాస వీనిని పోకడుచు.

తారమాక్షీకశోధనము,

శ్లో॥ కర్కోటికాభేకికిలమేషశృంగిరసైశ్చజంబీరగసైర్ద్రిసైకమ్ । సంభావయేదాతపకేసుతీవ్రేశదాసుశుద్ధానిజతారమాక్షికా ॥

తా॥ తారమాక్షీకమును మాతీఫలరసము, పట్టిచెట్టురసము, నిమ్మపండ్లరసము వీనితోభావనచేసియొకదినము తీవ్రమగు యెండనెండించిన నది శుద్ధమగు.

తుత్థకశుద్ధి.

శ్లో॥ కపోతమార్జారపురీషసార్థం విమర్దయేత్తుత్థక ఏవ గాఢమ్। దశాంశకంటంకణమేవదత్వా సంవాచయేత్తన్మధునాచదగ్ధ్వా । క్షణంవిధేయశ్చహిరణ్యరేతాః పుటేపుటే తుత్థకమేవశుద్ధమ్॥

తా॥ మైలుతుత్తమును పావురపిట్టపెంటము, మార్జారవిష్ఠము, వీనిచే బాగుగమర్దించి యిందు దశాంశము శుద్ధిజేసిన వెలిగారము వైచి మర్దించి బిళ్లచేసి యెండనెండించి ప్రమిదెలయందునించి చీలజేసి క్షణకాలము పచనము జేసి యందుండితీసి దానిని సాంగశీతలమున పెరుగుతో మర్దించి పైప్రకారము పుటంబిడి మరల నందుండి దానిని సాంగశీతలమున తీసి తేనెతో మర్దించి క్షణకాలము పుటంబిడిన నది శుద్ధియగు.

హరితాళకశుద్ధి.

శ్లో॥ డోలాయంత్రేకాంజికేశుద్ధతైలే కూష్మాండాఖ్యే చైవరాయాంకషాయే । యామంయామంపాచయేత్తాలచూర్ణం పశ్చాచ్ఛుద్ధం కార్యకే యోజనీయమ్॥

తా॥ హరితాళకచూర్ణమును డోలాయంత్రములో నునిచి కలి, తైలము, గుమ్మడురసము త్రిఫల కషాయము, వీనిచే ప్రత్యేక ప్రత్యేకముగ నొకయామము వండిన నది శుద్ధియగు. ఇట్టి దానిని సర్వకార్యములయందుపయోగింపనగు.

హరితాళకమారణము.

శ్లో॥ సూక్ష్మంవిచూర్ణం శుచితాలకస్య సంభావయేద్వింశతివాసరైశ్చ । అశ్వత్థతోయేశుచిఖల్వమధ్యే ఘృష్ట్వా విధేయో దృఢగోలకోపి । అశ్వత్థభూతాత్వర్ధభృతేచ భాండే న్యసేత్తతో గోలక ఏవమందమ్ । సంపూర్య భూతాత్వథశరావకేణ నిరుధ్య ముంచేచ్చగజాహ్వయంత్రే । సహస్రవన్యోపలసంయుతే చైమృతం వ్రజేద్యామచతుష్టయేన । నిర్ధూమమేవం యదితత్తలోహం ముంచేత్సశుద్ధం శుభశుక్లవర్ణమ్॥

తా॥ శుద్ధిచేయబడిన హరితాళకచూర్ణమును రావిపట్టరసమున (౨౦) దినములు భావనచేసి ఖల్వమున మర్దించి బిళ్లజేసి యెండించి యొకచిన్నమంటికుండలో సగమువరకు రావిచెక్క భస్మము బోసి దానిపై నాబిళ్లనునిచి దానిపైమరల రావిచెక్క భస్మమును బోసి నాకుండపై మూకుడుమూసి చీలమన్నుచేసి యెండించి ౧౦౦౦ ఏరు

పిడకలతో గజపుటంబిడిన నాలుగు ఝాములలో మృతిజెందు - అంటుపొగ లేవకుండిన నదిమృతిజెందినదని నెఱింగి దానినిసాంగశీతలమునపేసి యినుపపాత్రను తప్తముచేసి యందాశుక్లవర్ణహరితాళక భస్మమునుపైచిన నది పరిశుద్ధంబగు.

## హరితాళగుణము.

శ్లో ॥ అశీతివాతానక్ఫపిత్తరోగాన్కుష్ఠంచమేహంచగుదామయంచ। నిహంతివల్లార్ధమితంచతాళంషడ్వల్లఖండేనసమంచభుక్తమ్ ॥

తా ॥ వల్లార్ధప్రమాణశుద్ధహరితాళక భస్మమును ఆరువల్లములకలకండలో కలిపి సేవించిన ఎనుబదివాతములు, కఫపిత్తరోగములు, కుష్ఠువు, ప్రమేహము, మూలవ్యాధి, మొదలగు సమస్తరోగములు నశించు.

## అపక్వహరితాళదోషము.

శ్లో ॥ అశుద్ధతాళంఖలుపీతవర్ణంసధూమకంవాతచయంచపిత్తమ్। పంగుత్వకుష్ఠేతనుతేనరాణాందేహస్యనాశంప్రకరోతిసద్యః ॥

తా ॥ అశుద్ధ హరితాళకము వాతసంచయము, పిత్తము, పంగుత్వము, కుష్ఠువు, వీనినిగలుగంజేయుటయేగాక శరీరమునకు పీతధూమ్రవర్ణములను, శీఘ్రముగ నాశనంబును గలుగంజేయు.

## మణిశిలశుద్ధి.

శ్లో ॥ అజాయాశ్చమూత్రేపురాపాచయేద్దివ్యమణశ్శిలాత్ర్యహం డోలకాయంత్రవర్యే। తదాపాచయేత్తప్తపాత్రేతుతైకంసుశుద్ధాశుభేసర్వకార్యేప్రయోజ్యా ॥

తా ॥ మణిశిలను డోలాయంత్రమున నునిచి అందు మేకమూత్రముబోసిమూడు దినములు వండి పిదప దానిని లోహపాత్రలోనునిచి క్షణకాలమువరకువేయించిన నది శుద్ధియగు. ఇట్టిమణిశిలను సర్వకార్యములయం దుపయోగింపనగు.

## రసక (కఫరి) శుద్ధి.

శ్లో ॥ పుంసశ్చమూత్రేరసకస్యచూర్ణంగోమూత్రకే సప్తపచేద్దినాని। సండోలకాయంత్రవరేసుశుద్ధంసంయోజనీయంసకలేతుకార్యే ॥

తా ॥ రసమును చూర్ణముజేసి డోలాయంత్రమునన్నునిచి అందునరమూత్రము, గోమూత్రముబోసి యేడుదినంబులు వండిన నది శుద్ధియగు - ఇట్టిదానిని సర్వకార్యములయం దుపయోగింపనగు.

## అభ్రకసంఖ్య.

శ్లో॥ అభ్రంసంకథితంచతుర్విధమథోశ్వేతంచకృష్ణంతథా।పీతం ధూమ్రమథోవిమృశ్యసుధియాశ్వేతంచవిప్రాభిధమ్ । కృష్ణంక్షత్రియమేవ పీతగగనంవైశ్యంచధూమ్రంతథా । శూద్రంసంగదితంభిషగ్వరగణైర్గ్రంథార్ణవజ్ఞైర్బుధైః ॥

తా ॥ అభ్రకము శుక్ల, కృష్ణ, పీత,ధూమ్రములన నాలుగు విధములు-అందు శ్వేతవర్ణముగలది బ్రాహ్మణజాతియనియు, కృష్ణవర్ణముగలది క్షత్రియజాతియనియు, పీతవర్ణముగలది వైశ్యజాతియనియు, ధూమ్రవర్ణముగలది శూద్రజాతియనియు,బుద్ధిమంతులగు వైద్యశ్రేష్ఠులు వచించెదరు.

శ్లో ॥ శ్వేతాభ్రకేరూప్యమథోవదంతికృష్ణాభ్రకేజాంబునదంసువైద్యాః । విచిత్రవర్ణత్వమథోపిపీతేనిరర్థకంధూమ్రసమానకాభ్రమ్ ॥

తా ॥ శ్వేతాభ్రకము రౌప్యగుణతుల్యముగను, కృష్ణాభ్రకము, సువర్ణగుణతుల్యముగను, పీతాభ్రకము అనేకగుణతుల్యముగను ధూమ్రవర్ణాభ్రకముగుణవిహీనముగను, నుండునని వైద్యవరులు వచించెదరు.

## అభ్రకదోషము.

శ్లో ॥ గగనేగరలాదిదోషకంభిషజస్సంప్రవదంతిమానినకి। అథతత్స్వవిశుద్ధిమారణేకథయిష్యేవిధినైకవర్త్మనా ॥

తా ॥ అభ్రకమున విశేషదోషముగలదని వైద్యవరులు వచించెదరు-అదినివర్తించుటకై తగినశుద్ధిని, ఒక విధముగ మారణమును వచించెద.

## అభ్రకమారణము.

శ్లో ॥ఉలూఖలేఖండితమభ్రకృష్ణంతుపేత్తథాకాంజికఏవవైద్యః పిష్ట్వాశిలాయాంచపునఃపునశ్చన్యసేత్సుసత్యం కిలసప్తవారమ్ ॥ పశ్చాద్భాండముఖేనిబధ్యరుచిరంవస్త్రంజలైఃపూరయేత్ । తద్వ్రీహిత్వచ

యాసమందృఢతరంసంమర్దయేద్ధస్తకైః । యద్ఘృష్టాద్యదధఃపతేచ్ఛుభతరంజాతంచధాన్యాభ్రకమ్ । పశ్చాచ్ఛుద్ధశిలాతలేదృఢతరంసంమర్దనీయంతదా । వజ్ర్యాగోఽర్కోద్భవదుగ్ధధేనుసలిలైర్బ్రాహ్మీహిమ్నాఽదంతీబలా । వాసాచిత్రకశాల్మలీబలవరాకూష్మాండికాదాడిమీ। జాతీగోక్షురశంఖపుష్పలతికామోదామృతాబర్బరీ। ద్రాక్షామూలకరాక్షసీతులసికాముండీవిశాలామదా । గోజిహ్వాసలిలైర్విదారిలతికాభృగ్వ్యాఘ్రగంధాజల । శతపుష్పాతపనోద్భవైస్స్వరసకైస్సంవేష్టయేద్వైద్యరాట్ । రాత్రౌ సంపరిపాచయేద్గజపుటైస్సప్తైవవారాన్ పృథక్ । న్యగ్రోధస్యజటారసస్యసతతం కేశేశతోయస్యచ । భానాశ్చైవపుటాన్ప్రవింశతిమితాః ఘృష్ట్వాకపిత్థస్యవై । చించిణ్యాఃఫలకోద్భవైశ్చ సలిలైశ్శ్రీమత్పుటే తాస్త్రిభిః ।పశ్చాన్నింబరసస్యధేనుపయసస్సంమిశ్రగౌడస్యచ । దధ్నఃఖండఘృతస్యరమ్యామధునోవారాశ్చపంచాదశ । పశ్చాచ్చంద్రికయాభివర్జితమథాభ్రం వైసుశుద్ధంభవేత్ ।రక్తంరమ్యతరంసుసేవ్యమవనీశానాంగణైస్సర్వదా॥

తా॥ కృష్ణాభ్రకమును రోటిలోవైచి మెత్తగదంచి పుల్లనికలిలోనానవేసియుండి ప్రాతఃకాలంబున గ్రహించి ఖల్వంబుననునిచి మెత్తగనూరి మరల కలిలోనానవేయవలయు. ఇటులనేడుమార్లుచేసి పిదప నొకకుండలో నుదకమువైచి దానిపైబట్టకట్టి యాబట్టపై అభ్రకపుముద్దను తగుమాత్రపు వరిపొట్టునునిచి హస్తముచే మర్దింపుచుండిన అభ్రకము కుండలో స్రవించు-పిదపనాకుండలోని పైనీళ్ళనువంచివేసిఅడుగుననిలచియుండెడి అభ్రకమును గ్రహింపవలయు. ఇదియ శుద్ధధాన్యాభ్రకమనంబడు. ఈశుద్ధధాన్యాభ్రకమును ప్రక్షాళనము జేసిన రాతిపై నునిచి దృఢముగ మర్దింపవలయు. పిదప దానిని బొంతజెముడుపాలు, జిల్లేడుపాలు, గోమూత్రము, బ్రహ్మిచెట్టురసము, సంజీవని, మత్తవపులగము, అశ్వసరము, చిత్రమూలము, బూరుగ, ఉలిమిడి, పిల్లిపీచర, కూశ్మాండము, దానింబ, జాజియాకు, పల్లేరు, శంఖపుష్పి, అజామోదము, తిప్పతీగ, వాయింట, ద్రాక్ష, ముల్లంగి, బలురక్కసి, తులసి, బోడతరము, వెఱ్ఱిపుచ్చ, మదా, ఎద్దునాలుకచెట్టు, నేలగుమ్ముడు, గుంటగలగర, నల్లవస, సోపు, నల్లజీడిగింజలరసము, వీనిరసములచే ప్రత్యేకప్రత్యేకములుగ నేడేడుమార్లుమర్దించి బిళ్లకట్టిసాయంకాలంబున ప్రత్యేకప్రత్యేకములుగ గజపుటంబులిడవలయు పిదప వీనిని మఱ్ఱిఊడలరసము, ములువెలగరసము వీనిలో ప్రతిదానిచే నిరువదిమార్లు భావనచేసియిరువదియునువదిపుటంబులిడవలయు. మఱియు దీనిని వెలగపట్టరసము, చింతపండుగుజ్జు

క్షీని చేభావనచేసి బాగుగపుటంబిడవలయు. మఱియు నిమ్మపండ్లరసము, గోమూత్రము బెల్లపుపానకము, పెరుగు, ఖండశర్కర నెయ్యి తేనెవీనిలో ప్రతిదానిచే ౧౦౹ భావనలుచేసి పుటంబులిడవలయు-యిటులపుటంబులిడిననది పరిశుద్ధమై తెలుపు వర్ణమునువిడిచి యెఱ్ఱగనగు - ఇట్టిఅభ్రకమును రాజులుసర్వదా సేవింపుచుండవలయు.

అభ్రకగుణము.

శ్లో॥ శుద్ధాభ్రంననువల్లకద్వయమితంకృష్ణామధుభ్యాంయుతమ్। మేహాశ్వాసవిషంచకుష్ఠమతులంవాతాంశ్చపిత్తాన్కఫాన్ । కాసక్షీణక్షతక్షయగ్రహణికాపాండుభ్రమంకామలమ్।గుల్మాద్యంచయథానుపానవిధినామృత్యుంచజేజీయతే॥

తా॥ ఇట్టిశుద్ధాభ్రకమున ఆరుగురిగింజల ప్రమాణము తేనె పిప్పలిచూర్ణము అనుపానముచేసి సేవించిన ప్రమేహము, శ్వాస, విషవికారము, కుష్ఠువు, వాతరోగములు, పిత్తరోగములు కఫరోగములు, కాస, క్షీణత్వము, గాయములు, క్షయము సంగ్రహణి, పాండువు భ్రమ, కామిల, గుల్మము మొదలగురోగంబులను, అకాలమృత్యువును బోకడచు.

శ్లో॥ (అన్యచ్చ) మృతాభ్రకంకామబలప్రదంచవిషంమరుచ్ఛ్వాసభగందరాద్యమ్। మేహాభ్రమంపిత్తకఫంచకాసక్షయం నిహన్త్యేవయథానుపానాత్॥

తా॥ మఱియు మృతాభ్రకము విషవికారము, వాతము, శ్వాస, భగందరము, ప్రమేహము, భ్రమ, పిత్తము, కఫము, కాస, క్షయము, మొదలగురోగముల యథానుపానమువలన బోకడచుటయేగాక వీర్యవృద్ధి బలములసగా గలుగంజేయు.

అపక్వదోషము.

శ్లో॥ చంద్రికాభియుతమభ్రకంయదా జీవితంఝుడితినాశయేత్తదా। వ్యాఘ్రరోమఇవచోదరస్థితంవాతసౌవితనుతేగదాన్బహూన్॥

తా॥ అపక్వాభ్రకము జీవితమునుశీఘ్రముగనశింపజేయునదిగను, వ్యాఘ్రరోమసమానమైనానావుపద్రవకారిగను, శరీరంబుననెలకొని బహురోగకారిగనునుండు.

శ్లో॥ (అన్యచ్చ) స్త్రోతాయత్తైఃపుష్పైస్త్రోసక్తైర్వరపక్తైర్వరభ్రకస్తథా। యథావ్యాఘ్రస్యరోమేవపంచత్వముపజాయతే॥

తా॥ మాత్రాప్రమాణహీనంబును, పుటహీనంబునగు అభ్రకము వ్యాఘ్రరోగ తుల్యంబయి ప్రాణహానింజేయు.

## ముత్తియములశుద్ధి.

శ్లో॥ తురంగీకిలాలాన్వితే డోలకే వైశుభం పాచయేన్మౌక్తికం చూర్ణమేవమ్ । దినైకంవిధేయోపివహ్నిశ్చమందంశుభే కార్యకేయోజనీయంతతశ్చ ॥

తా॥ ముత్తియముల చూర్ణముచేసి పొట్లముగట్టి యొకకుండలో ఆడగుఱ్ఱపు మూత్రమునునించి డోలాయంత్రములో నొకదినము మందాగ్నిచే పక్వముజేసిన నది శుద్ధియగు.

## పత్థ్యవిధి.

శ్లో॥ సర్వాన్ ధాతూపధాతూంశ్చయదా సేవతిమానవః।తస్య గోధూమచణకై స్తండులంచఘృతంపయః । శర్కరా భోజనేదేయా తైలంస్నానంచవర్జయేత్।అనుపానంసదా దేయంసుపక్వంసువిచారితమ్ ॥

తా॥ సువర్ణాది ధాతువులు ఉపధాతువులు, వీనిని సేవించెడి నరుడు గోధుమలు, సెనగలు, బియ్యము, నెయ్యి, ఆవుపాలు, శర్కర, వీనిని భోజనకాలంబున సేవింపవలయు-తైలము, స్నానము, వీనిని వర్జింపవలయు- బాగుగపక్వముచేయబడిన సువర్ణాదిధాతువులయుక్తానుపానముగను, పరిపాకానుగుణ్యంబుగను, ఒసంగవలయు.

## శూలాదిరోగములయందుసువర్ణాద్యనుపానము.

శ్లో॥ శూలేహింగుఘృతాన్వితంమధుయుతాకృష్ణాపురాణజ్వరే వాతేసాజ్యరసోనకైశ్శ్వసనకేక్షౌద్రాన్వితంత్ర్యూషణమ్ । శీతేవ్యాలలతాదలంసమరిచంమేహేవరాస్సోపలాః । దోషాణాంత్రితయేనుపానముచితంసక్షౌద్రమార్ద్రోదకమ్ ॥

తా॥ వేయించిన యింగువ, నెయ్యి, వీటిని శూలరోగంబునను,మధుయుక్త పిప్పలి చూర్ణమును పురాణజ్వరమునందును, నెయ్యి, లశునములు,వీటినివాతరోగమునందును, మధుయుక్తత్ర్యూషణమును శ్వాసరోగమునందును, ఎఱ్ఱచిత్రమూలపాకు, మిరియాలు వీటిని శీతరోగంబునందును, త్రిఫలకషాయము, కలకండ, వీటిని ప్రమేహాం

బునను, తేనె, అల్లపురసము, వీటిని సన్నిపాతరోగములయందును అనుపానము జేయవలయు.

శ్లో॥ వనపర్పటకంజ్వరే గ్రహణ్యాంమథితం హేమవిషేవ మీషు లాజా। కుటజోతిసృతౌవృషోష్ణపిత్తే గుడకీలేష్వనలక్షమేక్రిమిఘ్నః॥

తా॥ అడవిపర్పాటకమును జ్వరములయందును, సువర్ణభస్మమును చిలికినమజ్జిగతోడ సంగ్రహణులయందును, వరిపేలాలనువిషవికార వమనములయందును, కొడిశపట్ట, కొడిశవిత్తులు, వీటిని కఫ, పిత్తజనితఅతిసారములయందును, ఆర్ద్రగసమునుపిత్తగుదకీలను, అనలక్షమము, కృమిరోగము, వీనియందును అనుపానము జేయవలయు.

శ్లో॥ శూలవిస్ఫోటవాతేషు వ్రణేషు ఉంఛనక్రియా। రక్తస్రావే చాశ్మరే తథావృకీవిషూచికే॥

తా॥ శూల, విస్ఫోటకము, వాతరోగము, వ్రణము, మొదలగువానియందు ఉంఛనక్రియను, రక్తస్రావము, అశ్మరి, విషూచి, మొదలగురోగములయందు వృకీక్రియను జేయవలయు.

శ్లో॥ వాతరక్తేబలిందద్యాచ్ఛిరోరోగేషుశంతినా। అశ్మరీచతథాకృచ్ఛ్రే మేహమాహారీతకీబలిమ్॥

తా॥ వాతరక్తము, శిరోరోగము, వీటియందుశంతినిబలిదానము జేయవలయు అశ్మరీ, మూత్రకృచ్ఛ్రము వీటియందు తెల్లకరక్కాయను బలిదానమొసంగవలయు.

శ్లో॥ అపస్మారేచమూర్ఛాయాం తైలంవా యుసుశీతలమ్।ఊర్ధ్వవాతేబుద్ధిభ్రంశేదేవపుష్పంవచాసహ॥

తా॥ అపస్మారము, మూర్ఛ, వీటియందు తైలదానంబును, శీతవాతసేవనను జేయించవలయు. ఊర్ధ్వవాతము, (ఓకరి) బుద్ధిభ్రంశము, వీనియందు వస, దేవపుష్పంబును, బలిరొసంగవలయు.

శ్లో॥ ఉదరేశుక్పిప్పలీచతుష్మేచగుడుచీతథా। పాండౌరసాదయః శ్రేష్ఠాః ప్రదరేచరసాంజనమ్॥

తా॥ ఉదరరోగమున పిప్పలిని, క్షయరోగమునతిప్పతీగెను, పాండురోగమున పాదరసాదులను ప్రదరరోగమున రసాంజనమును, దానమొసంగుటఅత్యంతశ్రేష్ఠము.

శ్లో॥ దద్రుకండూపామకుష్ఠేచాకంగంధకపారదైః। లేపనాద్ధిభవేచ్ఛాంతిర్యథానేత్రేరసాంజనః॥

తా॥ దద్రుకుష్ఠము కండూరోగము, పామ, కుష్ఠువు మొదలగు రోగంబులయందు పాదరస గంధకముల నేకము చేసి లేపనము చేసిన నవి శమించు. అట్లేయగునేనేత్రరోగంబునరసాంజనము(సుర్మా రాయిని) అంజనము చేసిన నేత్రరోగము నివృత్తియగు.

శ్లో॥ ఏవమనుపానయోగేన భేషజం కారయేద్భిషక్। యథారోగ్యంతథాపథ్యం దేశకాలవయఃపునః॥

తా॥ దేశము, కాలము, అవస్థ, వీనిని విచారించి పూర్వోక్తఅనుపానముల ద్వారా వైద్యుడు ఔషధముల ప్రయోగింపవలయు.

ఇత్యనుపానమంజర్యాం ధాతుబిర్ధాతు మారణంతథోప
ధాతూనాంసంఖ్యాశోధనమారణానిఏవంధాతూ
పధాతుసేవినః పథ్యాపథ్యప్రకరణంనామ
షష్టస్సముద్దేశః.

---

ఔషధమానప్రయోజనము.

శ్లో॥ నమానేనవినాయుక్తిర్ద్రవ్యాణాంజాయతేక్వచిత్। అతః ప్రయోగకార్యార్థంమానముచ్యతేమయా॥

తా॥ తూనిక వినా యుక్తిచే యేద్రవ్యమును ఔషధములయందు జేర్చుకొనగూడదు. కావున ఔషధమును గావించునెడ యందుపయోగింపవలసిన ద్రవ్యాదుల తూనికెను, కొలతను, మాగధపరిభాషచే వచియించెద.

శ్లో॥ త్రసరేణుర్బుధైఃప్రోక్తస్త్రింశద్భిఃపరమాణుభిః॥ త్రసరేణుస్తుపర్యాయనామ్నావంశీనిగద్యతే॥

తా॥ (30) పరమాణువులొక త్రసరేణువనంబడు. మఱియునీత్రసరేణువుకు వంశియను నామాంతరమునగా గలిగియుండు.

పరమాణువు మొదలగువాటి వివరణము.

శ్లో॥ జాలాంతరగతేభానాయత్సూక్ష్మందృశ్యతేరజః। తస్యత్రింశత్తమోభాగఃపరమాణుస్సఉచ్యతే॥

తా॥ సూర్యకిరణములు కిటికి మొదలగువాటిలో ప్రసరించునపుడు అందుగానం బడెడి అణువులో (౩౦) వభాగము పరమాణువనంబడు.

శ్లో ॥ జాలాంతరగతైస్సూర్యకరైర్వంశీనిగద్యతే। షడ్వంశీభిర్మరీచిస్స్యాత్తాభిష్షడ్భిస్తు రాజికా।తిసృభీ రాజికాభిశ్చసర్షపః ప్రోచ్యతేబుధైః॥

తా ॥ కిటికి మొదలగువాటియందు ప్రసరించెడి సూర్యకిరణములచేగానంబడెడినలుసువ వంశియనంబడు. అట్టి (౬) వంశీలోకమరీచియనియు(౬) మరీచులొక రాజకయనియు, (౩) రాజికలొక సన్నఆవగింజ యొత్తనియు బఱంగు.

శ్లో ॥ యవోష్టసర్షపైః ప్రోక్తోగుంజాస్యాత్తచ్చతుష్టయమ్ । షడ్భిస్తురక్తికాభిస్స్యాన్మాషకోహేమధాన్యకౌ ॥

తా ॥ మఱియు (౬) ఆవగింజలొక యవగింజయనియు, (౪) యవగింజలొక గురిగింజయొత్తనియు, (౬) గురిగింజలొక మాషమనియు జెప్పంబడు-మఱియు నీమాషమునకు హేమమనియు, ధాన్యకమనియు, నామాంతరంబులు గలిగియుండు.

శ్లో ॥ మాషైశ్చతుర్భిశ్శాణస్స్యాద్ధరణస్సనిగద్యతే । టంకస్సఏవకథితస్తద్ద్వయం కోలఉచ్యతే । క్షుద్రభోవటకశ్చైవ వంక్షణస్సనిగద్యతే ॥

తా ॥ మఱియు (౪) మాషము లొకశాణమనియు, ధరణమనియు, టంకమనియు, జెప్పంబడు. (౨) శాణము లొకకోలమనియు, క్షుద్రభమనియు, వటకమనియు, వంక్షణమనియు బఱంగు.

శ్లో ॥ కోలద్వయంచకర్షస్స్యాత్సప్రోక్తః ప్రాణిమానికా । అక్షం పిచుః పాణితలంకించిత్పాణిశ్చతిందుకమ్ । బిడాలపదకంచైవ తథాషోడశికామతా । కరమధ్యోహంసపదంసువర్ణంకబలగ్రహమ్। ఉదుంబరంచపర్యాయైఃకర్షఏవనిగద్యతే ॥

తా ॥ మఱియు (౨) కోలము లొకకర్షమనియు, పాణిమానికమనియు, అక్షమనియు, పిచువనియు,పాణితలమనియు, కించిత్పాణియనియు, తిందుకమనియు,బిడాలపదకమనియు, షోడశికయనియు, కరమధ్యమనియు, హంసపదమనియు, సువర్ణమనియు, కబళగ్రహమనియు, ఉదుంబరమనియు, జెప్పంబడు.

శ్లో ॥ స్యాత్కర్షాభ్యామర్ధపలంశుక్తిరష్టమికాతథా। శుక్తిభ్యాంచపలంజ్ఞేయంముష్టిరామ్రంచతుర్థికా । ప్రకుంచష్షోడశీబిల్వం పలమేవాత్రకీర్త్యతే ॥

తా ॥ మఱియు ౨ కర్షములొక అర్ధపలమనియు, శుక్తియనియు, అష్టమిక యనియు, (౨) శుక్తులొకపలమనియుముష్టియనియు, ఆమ్రమనియు, చతుర్థిక మని యు, ప్రకుంచమనియు, షోడశీబిల్వమనియు, జెప్పంబడు.

శ్లో ॥ పలాభ్యాంప్రసృతిర్జ్ఞేయాప్రసృతశ్చనిగద్యతే। ప్రసృతిభ్యామంజలిస్స్యాత్కుడవోర్ధశరావకః । అష్టమానంచసంజ్ఞేయం కుడవాభ్యాంచమానికా । శరావోష్టపలంతద్వజ్జ్ఞేయమత్రవిచక్షణైః ॥

తా ॥ మఱియు (౨) పలములొక ప్రసృతియనియు, ప్రసృతయనియు, (౨) ప్రసృతలొకయంజలియనియు, కుడవమనియు, అర్ధశరావకమనియు,అష్టమానమనియు (౨) కుడవము లొక మానికయనియు, శరావమనియు అష్టపలమనియు, బఱంగు.

శ్లో ॥ శరావాభ్యాంభవేత్ప్రస్థశ్చతుఃప్రస్థైస్తథాఢకమ్। భాజనంకాంసపాత్రంచచతుష్షష్టిపలంచతత్ ॥

తా ॥ మఱియు (౨) శరావకములొక ప్రస్థమనియు (౪) ప్రస్థములొకఆఢక మనియు-భాజనమనియు, కాంసపాత్రమనియు, జెప్పంబడు.ఆఢకమన (౬౪)పలములు.

శ్లో ॥ చతుర్భిరాఢకైర్ద్రోణఃకలశోనల్వణోన్మనా। ఉన్మానశ్చఘటోరాశిర్ద్రోణపర్యాయసంజ్ఞకాః ॥

తా ॥ మఱియు (౪) ఆఢకము లొకద్రోణమనియు, కలశమనియు, నల్వణమనియు, ఉన్మనమనియు, ఉన్మానమనియు, ఘటమనియు, రాశియనియు, బఱంగు.

శ్లో ॥ ద్రోణాభ్యాంశూర్పకుంభౌచచతుష్షష్టిశరావకః । శూర్పాభ్యాంచభవేద్ద్రోణీవాహోగోణీచసాస్మృతా ॥

తా ॥ మఱియు (౨) ద్రోణము లొక శూర్పమనియు, కుంభమనియు, (౨) శూర్పములొక ద్రోణియనియు, వాహమనియు, గోణియనియు, చెప్పంబడు -ద్రోణి యన (౬౪) శరావములు.

శ్లో ॥ ద్రోణీచతుష్టయంఖారీకథితాసూక్ష్మబుద్ధిభిః। చతుస్సహస్రపలికాషణ్ణవత్యధికాచసా ॥

తా ॥ మఱియు (౪) ద్రోణులొకఖారియని జెప్పంబడు - ఖారియన (౪౦౯౬) పలములు.

శ్లో ॥ పలానాంద్విసహస్రంచభారఏకఃప్రకీర్తితః। తులాపలశతంజ్ఞేయంసర్వత్రైవైషనిశ్చయః ॥